శ్రీ ర స్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# దేశింగురాజు కథ



ప్ర కా శ కు లు:

యన్. వి. గోపాల్ అండు కో.,

నెం. 63, కృష్ణప్పనాయకన్ గుంట వీధి,

మ ద రా సు–1.

1952 0-12-0

# శ్రీమద్రామాయణ సంగ్రహము.

తెనుగు వచనము,

****

రామాయణమునందలి ముఖ్యాంశములను సంగ్రహపరచి వ్రాయుట వలన గ్రంథరాజమును సంగ్రహరామాయణమనబడును. ఇందు దశరథుని రాజ్యవిభవమును దశరథునికి పుత్రులు లేనందున కులగురువగు వసిష్ఠులవారి అనుమతిని పుత్రకామేష్టి యాగము జేయుటయు పుత్రోత్సవమును, శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నుల జననము నుండి విశ్వామిత్రుడు వచ్చి శ్రీరాములను యాగ సంరక్షణార్థము పంపుమని దశరథుని కోరుటయు, వసిష్ఠుల వారి అనుమతిని విశ్వామిత్రుని వెంట శ్రీరామలక్ష్మణులనుపంపుటయు, విశ్వామిత్రయాగసంరక్షణమును, తాటకిసంహారమును, విశ్వామిత్రుని వెంట మిథిలానగరమునకు జనుటయు, జనకుని పుత్రికయగు జానకిని వివాహము చేసుకొని అయోధ్యకు వచ్చుటయు, శ్రీరాములవారికి పట్టాభిషేక భంగమును, తదనంతరము సీతాలక్ష్మణ సమేతులై పితృవాక్యపరిపాలనార్థము అరణ్యమునకు జనుటయు దండకారణ్య ప్రదేశమున రావణుడు సీతనుగొనిపోవుటయు, రాముడు సీతను వెదకుటయు, వానర సైన్యముతో సేతువుబంధించి లంకకుపోయి రావణ కుంభకర్ణులవధించి, సీతనుగ్రహించి విభీషణునికి పట్టాభిషేకము చేయించి, శ్రీరామలక్ష్మణులు సీతాసమేతముగా పుష్పక విమానారూఢులై అయోధ్యకువచ్చి పట్టాభిషిక్తులగువరకును ఆయాసందర్భముల చిత్రపటములచేర్చి ముద్దులొలుకు తెనుగు మాటలతో స్త్రీలకు బాలురకుకూడ బోధ పడునటుల వ్రాయబడినది. ఇందలికథ మిక్కిలి యద్భుతముగాను చదివెడువారికి నింపు పెంపొంద జేయదగిన గ్రంథరాజము. క్రొత్తకూర్పు అట్ట బయిండు. వెల 2-0-0

యన్. వి. గోపాల్ అండు కో.,
నెం. 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి,
సౌకారుపేట పోస్టు మద్రాసు.

శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# దేశింగురాజు కథ.

క. శ్రీ గౌరీభారతులకున్ ।
బాగుగనే జాలదంతు భక్తితో నెపుడున్ ।
సాగిలబడి నుతియించెద ।
వేగమె రక్షించుకొరకు వేడుకలలరన్ ॥

క. సకల దేవతలెల్లను సంభ్రమమున ।
ప్రకటితంబుగ కొనియాడి భవ్యముగను
రంగుమీరంగ దేశింగురాజుకథను ।
జెప్పెదను నేను లోక ప్రసిద్ధిగాను ॥

క. ఇలలోగల బుధులీకృతి ।
గలతప్పులుదిద్ది మెచ్చి గాంభీర్యముగా
వెలయంగ జేయవలెనని ।
చెలువుగ కోరెదను మిమ్ము సిద్ధముగాగన్ ॥

## కథా ప్రారంభము.

శ్రీకరముగ గణనాథుని పదములు చెలువుగ సేవించి
ప్రకటముగ పద్మజురాణిని భక్తితోడ దలచి
ముదముతో హరిహర పరమేశ్వరులను మదిలో నర్పించి
సదయుడైన శ్రీగౌరీవాణుల సంప్రీతితో నెంచి
వరకవులకు వాల్మీకాదులకు వందనములుచేసి
గురుతరముగ సద్గురువులనెల్లను కోరిపూజచేసి
ఈవసుధను నెల్లూర్పురవాసుడ నింపుమీరద నేను
సంతసమున దేశింగురాజకథ చక్కగ జెప్పెదను
వింతగ నీభువిలో నందరు విస్మయమొందగను

సురపతి నారదసంవాదంబిది చోద్యముగ నిపుడు
వడుసగ నదియెట్లన్నను దెల్పెద సరవితోడ వినుడు.

దేవేంద్రుడు కొలువై యుండగా నారదుడు వచ్చుట.

నాగాదిపుడగు పాకారియుతా నధికభోగముగను
వేకువతోడను సింహాసనమున తేజరిల్లగాను
సురగరుడోరగ సిద్ధసాధ్యులు నూటిగ గొల్వగను
సురగానరంభాద్యప్సరలపుడు సరసతనాడగను
మురియుచు ఫణిసతులెల్లను గొడుగులు గరిమతో పట్టగను
పరమాద్భుతముగ కిన్నరులెల్లను మరిమరి పొగడగను
డంబుమీర తుంబురు నారదులు నంబరమున బాడ
జంభభేరి గొలువున బుధులెల్లరు సంభ్రమంబుతోడ
వుండగ నారదు డొకనాడచటికి నొప్పగానురాగా
దండిగకొలువుననుండి యింద్రుడా తపసిజూచి వేగ
సముత్థితుడై తానర్ఘ్యపాద్యములు నతిభక్తితోనిచ్చి
సంభ్రమము మీరవగ నాతని సుచితాసనమందునునిలిచి
స్వామి మీరలు మూడులోకములు సంచరింపబూని
భూమిపగల వింతలు దెల్పుం డిపుడేమయినాగాని
వినగోరెదనీవాక్యపద్ధతిని వీనుల వేడుకగాను
మనములరగనే చోద్యమునుండిన మాకుదెల్పుడిక వేడా
అనిసురపతి యానందంబున నమ్మునివరు నడుగగను
తనమదిపొంగుచు యింద్రునితో నాతపసి యిటులనెను

నారదుండు దేవేంద్రునితో దేసింగురాజుకథను జెప్ప నారంభించుట.

సురనాయక యొకయాశ్చర్యము విను సొంపుమీర నిపుడు
వడువడిదెల్పగ వచ్చితినీకు పరమప్రీతితో నేడు
స్థిరముగ భువిలో నేబదియారు దేశంబులనుండు
పరమప్రసిద్ధము హైదరాబాదు పురమనే గోల్కొండ
ఢిల్లీ భాదుషా యేలుతుండేమరి సలలితంబుగను
యెల్లలోకులకు నధిపతియైతా నేకచక్రముగాను
ఇంపుగ నేలచుండగ జరిగిన యితిహాసంబును నేను
ఇంపుగ జెప్పెద విస్తరంబుగా చోద్యంబంతయు వినుము

అని నమ్ముని శేఖరుతో నింద్రుండవు డిట్లనియె
మునినాయక నీపలుకులు సంతస మొసగబల్కెద వినియె
వినుసురనాయక భూమండలమున నెసమేరువునందుఁ
మునులు పలువురు తపములు జేయగ మొదమొదవగనందు
ఘనుడు మహాత్ముడు గోగుపకీ రనువాడు తాను
మనములరగ ఘనతపమును జేయుచు మంత్రతంత్రములను
తెలిసి సిద్ధుడై యుండగ నచటికి దేవలోకమందుండి
విలసిత బారాపాజారి రాగను వెలగుతోడనుండి

గోగుపకీరు ఢిల్లికి గుఱ్ఱమును తెచ్చుట.

మేఘమండలమునందు తిరిగెడు మేటితురంగమును
లాఘవమునబట్టగ దలచియు నాగోధాపోవగను
చూచి మంత్రతంత్రంబులచేతను చోద్యంబుగ వశపరచి
అణచి పట్టుకొని ఢిల్లికి వేగమె యతిమోదంబున నడచి
వచ్చి రొక్కచో డేరావేసి పరులకు తెలియకనుండ
అచ్చటనుండి చుట్టును పారాల్ మెచ్చుగ నుంచగను
అప్పుడు బారాజారిగర్జన గొప్పగ జేయగను
తప్పక ఢిల్లిలోగల జనులందరు తడబడి మూర్ఛిలను
చెందినబాతు విని యప్పుడు తాసందేహించుచును
ఇందుగలిగిన ప్రళయంబేమో యిది తెలియగవలెను
తొమ్మిదిమేఘము లొక్కగర్జన తోడిబడజేసినదో
ఇమ్మహిగలుగు సముద్రములెల్లను ఇటుఘోషించినదో
అని మతినెంచుచు నతివేగంబున తనకహాత్తునకువచ్చి
ఘనుడౌ బడేది వాంజి రాజ లింగబాబు నటుగాంచి
రావోయ్ వింతలు గనబడె నేడు రాజలింగబాబు
రావము కలిగినది యేమిప్పుడు రాజలింగబాబు
గర్జనజేసిన దేమది జెప్పుము ఘనుడ లింగబాబు
గర్జిపుము నీవిప్పుడు దానిని పరగలింగబాబు
అనగా వినియు రాజలింగబా బప్పుడిట్టులనెను
మనవినివినుము పాదుషాయివుడు మరిచెప్పెదనేను
గోగుఫకీరియనువాడిట కొకగుఱ్ఱము తెచ్చెను నేడు

బాగుగ దివ్యహాయంబును దెచ్చెను పట్టుపడదుచూడు
మంత్ర తంత్రములచేతను దానిని మంచిది దెచ్చినవాడు
యెంత మంత్రంబులచే వశముచేసుకొని యిటకువచ్చినాడు
యెంతటి ధైర్యముగలవారైనను యెక్కలేరుదాని
వింతగనున్నది తన్నుపాచ్ఛా వేగచూచెదాని

పాచ్ఛా గోగుఫకీరికి బహుమానములిచ్చి గుఱ్ఱమును తీసుకొనుట

సంతోషముతో నప్పుడుపాచ్ఛా చయ్యన ఫకీరునకు
కొంతధనంబును బహుమానములు కొల్లగనిచ్చియు వురికి
హయమును గొనితా తెప్పించియు లాయములోకట్టించి
నయమున గోగుఫకీరునప్పుడె నచటనుండి రప్పించి
పరువడితో రాజలింగబాబులు పాచ్ఛానటుచూచి
వరుసనందరు పాళెగాండ్రను త్వరలోరప్పించి
ఈ గుఱ్ఱము నెక్కినవారలకిక బహుమతు లిప్పించ
బాగుగ యెక్కనివారల ఖైదులో వేగమె బెట్టించు
అని శెలవిచ్చిన రాజలింగబా బరకారుల నంపగను
పనివడిపింపిన హూరకార్లేగి యనువుగ జెప్పగను
వచ్చిరి హయమును చూచుటకై యాపాళెగాండ్రందరును
యెచ్చుగు నాగుఱ్ఱంబునుజూచి యెక్కలేము మేమనగా
అందరు ఖైదులో నేడు వర్షములు నమరగ నుంచుమనెన్
ఇందిర నెవను రాజలింగబా బిప్పుడు దెల్పుమనెా
మనవి యొక్కటి వినుమిక పాచ్ఛామరి చెప్పెదనేను
ఘనతారాజులు గలరనేకులు కనుగొన భూవిలోను
ప్రవిమలమతులకు రాజులందరు పరగయెక్కలేరు
అవితథసౌర్యులు వశిమారులు యీ హయమును నెక్కలేరు
ఇప్పుడు దక్షిణదిక్కువకుంజని పట్నమునందుగలదు
గొప్పకోట దుర్గంబును నచ్చట నొప్పుగాను గలదు
తనరగ చెంజికోటనుయేలే ధరణిసింగురాజు
తనయులు యిద్దరు శూరసింగును ధరణిసింగురాజు
శూరసింగుడును ధరణిసింగుడును సొంపు చెంజికోట
వారలిద్దరును యేలుచుందురు వదలక నానాట

శూరసింగునకు సమానశూరులు వేరేలేరచట
ధీరవరుండగు ధరణిసింగునకు దీటుగాకమెచట
బహుశూరులు యీ బారాహజారిని పటుగతి నెక్కుదురు
సహజంబుగ వారిద్దరు గుఱ్ఱము చక్కనెక్కగలరు
అనగనువిని హారకారుండు నచటికి నతిశీఘ్రముగాను
పరువడిపంపుడు రాజలింగశా బహుపుమీరగాను
అంతట రాజలింగబాబుతా హారకర్లను బిలచి
సంతసమున నా చెంజికోటకును జాబువ్రాయనెంచి
పెద్దకరణమును రంగపిళ్ళను బిళ్ళమనుచుబంపి
పెద్ద కరణమును రంగపిళ్ళను బిల్వమనుచుబంపి
వద్దచేరియా రంగపిళ్ళయటు పాచ్ఛావునుగాంచి
సలాంచేసిన రంగపిళ్ళను చక్కగానునూటి
సలాంబదులు రంగపిళ్ళను చయ్యనపటుగాంచి
రంగపిళ్ళ సివిప్పుడు చెంజికి వ్రాయవలెనుజాబు
సంగతులన్నియు తెలియజెప్పెడను వరగవ్రాయుజాబు

## శూరసింగునకు రాజునకు పాత్షా జాబు వ్రాయుట.

సలాం శూరసింగురాజువో సలామయ్యసీకూ
బలేశూరులని మిమ్ముగాంచుటకు పరగబుద్ధిరాకు
కలిగియున్నది మాపై మీదయ కలుగవలయు నేను
సలలితముగ రావలె నిచ్చటికి చయ్యనను యువుడు
నతతంబును రాజులనందరిని నమ్మతి జూచితిని
మతిమంతుల మిము జూడగవలెనని మరియువు డంపితిని
అని యీరీతిని వ్రాసిపంపుము వినయముమ రంగపిళ్ళ
అనినాతడు జాబువ్రాసెను విని యా సంగతులెల్ల
జాబుతెచ్చి హాక్కార్పాయ్యతో సవి స్తలంబుగాను
జాబువారిగా తెలియజెప్పియట పాపువేళలోను
యేనూరామడదూరము చెంజికి యీ ఢిల్లికి యిప్పుడును
పూనితపాలా గుఱ్ఱములేనూర్ పొందుగ నుంచుకొని
మరి చెంజికిపోవోయి నీ విప్పుడు హారకార్ పాపయ్య
చెంజికిపోయి శూరసింగు నిటు తేవలెవడిగాను

రంజితమ్ముగ పోయి నీవిటు రమ్మ జల్దిగాను
తడయక హార్కార్ పాపయ్య నప్పుడు తపాల్ మార్గముగ
వడిగా నప్పుడు పాతచెంజికిని వచ్చెను వేడుకగా
శూరసింగుడును కొత్తచెంజిలో సొంపుకొల్వులోను
ధీరులైన తనమంత్రుల గూడుక తేజమలరగాను
ఉన్నకొల్వునకు హార్కార్ పాపయ్య తెప్పగానువచ్చి
సన్నుతుండగు యీశూరసింగునకు జాబులు నిచ్చిరి

హార్కార్ పాపయ్య శూరసింగునకు జాబుయిచ్చుట.

వినయముతో హార్కార్ పాపయ్య వేడ్కసలాంచేసి
చనువుతోడ శూరసింగునకు జాబంతటతీసి
సొంపుగనిచ్చిన హార్కార్ నప్పుడు శూరసింగుజూచి
పెంపుతో యెవరు బంపితెవచ్చితి పేరేమనిలేచి
అప్పుడు సలాంచేసిపల్కెను హార్కార్ పాపయ్య
జెప్పెదనిప్పుడు సంగతులెల్లను చెలువుగవినవయ్య
హెచ్చుగఢిల్లీ పాచ్చామిమ్ముల నేడు చూచుటకును
అచ్చటికిని మిమ్మును తెమ్మనగా వచ్చినాను నేను
జాబుచూడగా నన్నిసంగతులు సవిస్తారముగాను
జాబులోను తెలునును మీకు పరమపదంబునను
అనిగమ్ముడగు ధరణిసింగును వంతతానుపిలచి
తనచేజాబును చదివిదెల్పుమని తమ్మునిచేతికినిచ్చి
ఇచ్చిజాబును చదివిసంగతు లేర్పడదెల్పగను
ముచ్చటవినియా కొలువునజనములు మురియుచువినగాను
తనమంత్రుల జూచప్పుడుబల్కెను దనరచోద్యముగను
వినరయ్యావో మంత్రులారా యీవివరము జెప్పెదను
ఘనుడగు పాచ్చావును జూడగను కడుప్రీతిగ నేను
మనమలరగ యీఢిల్లీకిపోయి మరలిటువచ్చెదను
వచ్చుదాక యీరాజ్యము మీరే [illegible] కమాచుకొని
హెచ్చుగనిచ్చుటి సమాచారములు శీఘ్రంబున నాకు
పా[illegible] ప్పటికి తెల్పుడు పరగ నేనుమీకు
చేయుదునిచ్చటికి సమాచారములు శీఘ్రంబున నాకు

చెలువుతోడ నాసంగతులెల్లను తెలియఁజేసెదను
నెలమితోడనే పోయివచ్చెదను యింతవేడ్కగాను

శూరసింగు తన భార్యవద్దకుఁ బోవుట.

అనితసమంత్రుల సమ్మతిపరచి యంత తాను లేచి
మనములరగయా నగరుకుయేగి తనసతినటుగాంచి
సతివినుమొక్కటి నేను జెప్పెదను చయ్యన రాంభాయి
హితమతితోడను నీకుదెల్పెదను యిపుడు రాంభాయి
రయమునఢిల్లీ పాచ్చాతన్ను రమ్మనెజల్దిగను
నయముతోడనే బోవలెనిప్పుడు నచ్చటికిఁబోయెదను
ఇచటభద్రముగ నుండుమునీవు యిప్పుడు రాంభాయి
అచటికిపోయి జాబువ్రాసెదను యిచటికి రాంభాయి
పరగపోయి వచ్చెదనని చెప్పిన ప్రాణనాథుతోను
సరగునరాంభాయి చింతనొందుచును చయ్యననిట్లనెను
దేవరవారికి నేనుయిపుడు తెలియజెప్పగలను
నావకాశము లేదికప్రసవ సమయంబిదియనిన
కరుణతోడ రాంభాయినిజూచి కలకలనవ్వుచును
మరినీకేమిట తక్కువయున్నది మగువరోయిచ్చటను
పాయకదాదుల తోడనుండుము భద్రంబగ లేచి
పోయివచ్చెదనని తమ్మునినంతట పొందుగానుజూచి
వేయిగుఱ్ఱముల తయారించుము వేగధరణిసింగు
చేయవలసిన జాగ్రతలెల్లను జేయుధరణిసింగు
అనినతమ్మునను శూరసింగుడు నంతజల్దిగాను
ఘనసత్వములౌ హయములనెక్కి కదలిరంతలోను
త్వరలోఢిల్లికి వచ్చిచేరెరి తపాలమార్గముగా
ధరలోగల్గిన రాజులెల్లను తప్పక వచ్చిరిగా
పాచ్చాకొలువులో శూరసింగును బహుధైర్యముతోను
అచ్చాయనుచును పాచ్చావునకు తానుసలాంమనెను
బదులుసలాముసు చేసినాపెను పాచ్చానప్పుడును
ముదిసంతసమును శూరసింగునకు మర్యాదలతోను
వచ్చినరాజు లెల్లకొలువులో వరుసనుండగాను
అచ్చట కూర్చుండగనియమించె నయముగనిద్దరును

### ఢిల్లీపాదుషా శూరసింగునకు మర్యాదలుచేసి పిలిపించిన కార్యములు దెలుపుట.

శూరసింగుని పాచ్ఛానంతట జూచిపల్కెనపుడు
వారకనందరు రాజులువిననొక పలుకుబల్కినాడు
వినుడో దేశాధీశులార యొకవివరము నిప్పుడును
పనిపడిమిము పిలిపించినకార్యము బాగుగ దెల్పెదము
దేవలోకగుఱ్ఱం బొకటిక్కడ తేజరిల్లుచును
యీవసుధనుగల గుఱ్ఱంబులలో యిదియెక్కువగాను
ఉన్నదానికి నెక్కినవారికి నుచితంబుగా యిపుడు
మన్ననచేసి వారిపాళెమును మరియిచ్చెదనేడు
కొన్నియినాములు తోడనువారికి గుఱ్ఱమునిచ్చెదను
ఇన్నికార్యములు గలవిక్కడ నీయిష్టంబేమనెను
ఆమాటలువిని రాజులందరును అతిమోదంబునను
ప్రేమతోగుఱ్ఱము నెక్కుటకొరకై తానులేవగాను
ఘనశౌర్యులనగు రాజులనటుగని గలగలనవ్వుచును
కనుగొనివారల బాదుషానప్పుడు గ్రక్కుననిట్లనెను
యేనొకమాట చెప్పెదవినుడి యిడుడురాజులార
పూనిగుఱ్ఱమును యెక్కినవారికి పొసగరాజులారా
ఘనమగు బహుమతులనుయిత్తును మనమలరగనేను
ఘనులనివారిని మెచ్చిప్రియంబున కౌగిటజేర్చెదను

### ఢిల్లీబాదుషా రాజులతో ప్రతిజ్ఞజేయుట.

ఆగుఱ్ఱముపై నెక్కినవారిని అతికోపముతోను
వేగముగా నై దేండ్లదాకను వేతుకైదులోను
అనగావిని యారాజులందరు నపుడుసమ్మతించి
మనమునసందేహించుచుండగ మరిబాదుషాలేచి
వచ్చినరాజులతోడగూడుకొని వచ్చిరంతటను
అచ్చటబారా హజారిగనుగొన నతిభీకరముగను
అంతటబారా హజారిగర్జిల నట్టెనిగులుజెంది
గంతులువేసిన మాత్రముగోన కడుభీతియునొంది
మిన్నువిరిగి పైబడినటురాజులు మేదినిపైబడిరి

కన్నులుచెదరగ తలలువంచుకొని కడువడిచింతిలిరి
గడగడవణకుచు మూర్ఛిలదేలుచు కాళ్లునుకడువడిగా
తడబడనందరు యేమియుదెలియక తారుమారుగాగా
అప్పుడుపాచ్ఛాపును కనుగొని వారందరిట్లులనిరి
చెప్పలేము యీగుఱ్ఱముమహిమను అబ్బయేమొయనిరి
ఇప్పుడుమహా రాజీగుఱ్ఱము మే మెక్కలేమయికను
తప్పకయెక్కిన ప్రాణమునిలవదు తడయకమాకికను
దేవలోక గుఱ్ఱముపై నెక్కను దేవతిలేగాని
యీవసుధనుగల వారికితగునా యీగుఱ్ఱముపూని
యెక్కలేము యీగుఱ్ఱముపైని నిక్కముగా మేము
గ్రక్కున ప్రాణంబులతోనైనా కైదులోనుండెదము
అనునామాటలు తావినిపాచ్ఛా సంతటనవ్వుచును
ఘనముగ భూమీశులతోపల్కెను వినుడనుచునుతాను
యెంతోశూరుల రనిమిమ్ములనే నిచటికిరప్పిస్తి
నక్కకయినా మీయంతటిశౌర్యము లెక్కింపసరాదు
దిక్కులేని పాదూరికి నెన్నగ నక్కపోతురాజు
మేకపోతు గాంభీర్యంబనిచే మేదిని వినియుంటి
డాఖలాయె నామాట యిపుడు మీ డావుగనేగంటి
పురుషసింహములు దాల్చిన షండుడు పౌలతుల నేలుటయున్
అరయగనిటువగుమీర బారాహాజరి నేలుటయున్
బిడ్డయు నల్సనజాచి మీ చేటులు భీతియు జెందెదుగా
తెట్టనయినను యీ తేజీగర్జనకు దిగులిటు నొందెదుగా
అని యిటులోకులు పల్కెడు వాక్యములవి వృథాగాదయ్యో
చెనకిగూడుగానిది తెరగని మాచిత్తముగాన నయ్యో
బళేబళే వస్తాదులుమీరే వహ్వారే యనుచూ
చలోచలోతుం కైదునికిపుడే శీఘ్రము పొమ్మనుచు
వరుసగ రాజులనెల్లరు నైదుసంవత్సరంబు లిటను
సరవితో కైదులో నుండిన వెనుక ఆరవవత్సరము
ఊరికిచ్చుటనుండియు నావలపూరికి పోవలెను
సారెకుపాచ్ఛా యిట్లనిపల్కిన సమ్మతినందరును
నిండుకైదులో నుండువారల నెలకొక జాబులును

ఖండితంబుగా సంగతులెల్లను కనుబడప్రియముగను
వెతలబొందుచును వేయువిధంబుల విధిగడుదూరుచును
అతివ్యసనంబు గ్రుక్కుచు నుండిరి అప్పుడు నందరును
అటుల నారదుడు దెల్పగ నింద్రుం డత్యద్భుతముగను

ఇంద్రునకు నారదుండు చెంజిపట్ణముయొక్క వృత్తాంతమును దెల్పుట

పటుతరముగ మునినాథ దెల్పితిని పరమముదంబునను
అవనివృత్తాంతం బేమాయెను నారదనాకిటను
ప్రవిమలముగ నదిదెల్పుమన్నను పరమమోదమునను
వినుసురనాయక చెంజీపట్ణపు వృత్తాంతంబింకను
ఘనముగ నీకే దెల్పెదనిపుడు కలవృత్తాంతమును
చెంజింవిడిచియా శూరసింగుడు చేరగ డిల్లికిని
రంజితముగ నట యేడునాళ్ళకు రాంబాయికిని
పుత్రోత్పత్తియు గలిగిన నందరు భూరిసంతసమున
నేత్రోత్సవముగ పట్ణమెల్లను నెరశృంగారమున
భేరిఝాంకాలాది వాద్యములు భోరుగొల్పగాను
వారటుచక్కెర పంచిరప్పుడు వరుసతోవీధులను
పరమముదంబున వచ్చినవారికి బహుమతులనుయిచ్చి
అరయగ కొలువున నున్న జనులకునట యినాములిచ్చి
పుత్రునిజూచి సంతోషంబున పొంగెను రాంబాయి
గోత్రరక్షకుం డితడని తానుకోరెను రాంభాయి
చాలతపాలలో వచ్చిసజాబును చయ్యన నటుగాంచి
శూరసింగుడు ఖయిదులోపడ్డ సొబగులు తలపోసి
సారెకు వగచుచు విధినిదిట్టుచును సతిపతి దలచుచును
కూరిమిపుత్రుడు గలిగినప్పుడు మీరు లేకనిటను
తారుమారుగా నున్నదిగాదా తగుపని జరుగకను
పురుషుడు లేని యిల్లేటికి కాపురమిక నేమిటికి
పురుషుడు లేని సొబగేమిటికి మోహంబేమిటికి
పురుషుడు లేని విభవంబేమిటి భోగంబేమిటికి
పురుషుడు లేని పురమేమిటికి పుత్రుండేమిటికి
పురుషుడు లేని జీవనమేమిటికి భువిబ్రతుకేమిటికి

పురుషుని బాసిన జన్మమేమిటికి సిరులుండేమిటికి
బాలునిముద్దుల పలుకులు వినగను పరగప్రాప్తిలేక
చాలగచిన్ని కుమారుని నెత్తుక నరగగాంచలేక
యీతనయునిదా కండ్లజూచునో యెట్లున్నదో కాని
ధాత వ్రాలు యీరీతిరునన్నుండిన తప్పునె యెవరికిని
మంచిదికాని నోటులనయినా పతియూ వచ్చుగాక
మించున వేడుక నీ గుఱ్ఱమునే పెంచుచుందుగాక
అనుచు రాంభాయి వ్యసనమువదలి తనయునిజూచుచును
ఘనముగ సంతోషముతో పెంచుచు కడుప్రీతిగ తాను
జాబులు వ్రాసెను విభునకు నప్పుడు చయ్యనఢిల్లీకిని
జాబుచూచుకొని శూరసింగుడు పరగ వ్యసనమూని
ఉండగ చెంజిలో దేశింగుబాలుం డొప్పుగ వేడుకను
రెండుమూడు నాలుగుగైదు నెలలు నటువిండిన యంతటను
బోర్లబడుచును జరుగుచు సంతలో పొల్లుతిప్పడిల్లుచు
మెల్లనె నడచుచు దుముకుచు వ్రాలుచు మేలుగపరుగిడుచు
కుప్పిగంతులను వేయుచు సఖులతో గూడి చనువొనుచు
అప్పుడు తల్లిదగ్గరకొచ్చి యీకలాకనుచు
పాలుచక్కెర తెమ్మసి తల్లిని పలుమారడుగుచును
పాలుపాలని తల్లినిచేర పయ్యెద ప్రాకుచును
చన్నొసంగు మాయమ్మా యనిబల్ సద్దులొనర్చుచును
కన్నినరంతులు చేసిముద్దుగున చన్నులు త్రాగుచును
మేలుగతన తమసఖులతోడను మెలగుచు తిరుగుచును
వాలాయంబుగ మహామస్తానుని వదలక గూడుచును
తల్లిదగ్గిర చేరియమ్మా మాకింగ్రీడియనును
మెల్లనలేచి వెలుపటికొచ్చి మేటిపనులుగనుచు
అల్లకల్లోలము జేయుచు నూరిలో నెల్లవారి నేచు
సల్లలితంబుగ నీతివిద్యలు చయ్యన చదువుచును
సహజము మహామస్తానుడతో గుఱ్ఱపుసవారి చేయుచును
కహకహ నవ్వుచు కన్నతల్లి నటు న్నుల జూచుచును
అంతట మహామస్తానునిగూడి యట పరుగెత్తుచును
చెంతనున్న తనకొండలపై నెక్కి చయ్యనదుముకుచును

పంతములాడుచు గుండులనెత్తి పరగరువ్వుచును
గంతులు వేసినిండేటిలో నావలిగట్టుకు దాటుచును
పందెముచే నొకగుక్కకు మాడుపరువులూ పారుచును
సందేహించక పెద్దమ్రాకులను సరగున పెరుకుచును
పుంఖల సింహములను నెదిరించికొని పొడిచియు చంపుచును
తలచుక నొక సమయమందున తండ్రిని తల్లిని నడుగుచును
ఇటువలె నయిదేండ్లాడుచు నొకనాడింపుగ తల్లితోను
పటుతరముగ మా తండ్రి యేడియని పలుమారడుగగను

## దేసింగుతల్లి యాతనితో శూరసింగునియొక్క వృత్తాంతమును దెలుపుట.

తనయు నెత్తుకొని ముద్దుబెట్టుకొని తానిట్టులనియెగా
వినుకుమార మీ తండ్రి శూరసింగని దెల్పదొడగెగా
పనిబూనియు నీ తండ్రిని ఢిల్లీపాచ్చా వచ్చుటను
వినుమేడేండ్లటు కైదులో బెట్టినవిధమును దెల్పెదను
దేవలోకమందుండి యచటికొక తేజిరాగ నేను
యీవసుధనుగల రాజుల నల్లను యెలమి బిలిచినాడు
యీగుఱ్ఱంబును యెక్కినవారికి యినాము లిచ్చెదను
బాగుగ నెక్కనివారికి కైదులో పడపడి నుంచెదను
అనిచెప్పిన యారాజులు బారాహజారి నటుజూచి
ఘనమగు భయముకు జెందుచు మనముల గనుచింతిలిజూచి
సలామయ్యా బహుసలాము పాచ్చా సలామయ్యామీకు
బలే గుఱ్ఱమిది యెక్కగూడదు భయముగలిగెమాకు
అనగా పాచ్చారాజుల నందరనటు కైదులోనుంచెగా
మనమునవొక్కచు తనయునిగనియొక మాటమందలించెగా
పినతండ్రియు నీతండ్రియులిద్దఱు వినుమునాటనుండి
తనయా కైదులో నున్నారనగా తానటుకోపించి
పండ్లు పెట పెటని కొరికెనప్పుడు బాలుడు దేసింగు
కండ్లువురుముచును కోపముచేసెను ఘనుడగు దేసింగు
రెండుఘడియలకు లోపలఢిల్లిని పిండిగజేసెదను
దండియైన యాగుఱ్ఱమునెక్కి దౌడాయించెదను
అనుచుతల్లికి దండముబెట్టి యమ్మాయిప్పుడును

ఘనముగనాకు మంచిపుత్త్రరవు గ్రక్కునసీవలెను
ఇపుడుఢిల్లికి వడిగానేగియు నే నెక్కియుగుఱ్ఱమును
తప్పకతండ్రు లిద్దరి తెచ్చెద తల్లీవినుమనెను
జల్దీజల్దీ వుత్తరవిమ్ము జల్దిగానుతల్లి
జల్దిగానునే పోయివచ్చెదను సెలవొసగుముతల్లి
అనిచెప్పినయా తనయునిచూచి యంతవ్యసనమునను
వినరాముద్దుల కొడుకాతనయా నీవిటుబల్కితె
కనిచెప్పినా గర్భంబుచల్లగ నా చుట్టుముకను
నినువిడిచియునం గడియనైననే నెటులనుండగలను
అనుచు చేతులు పిసుకుకొనుచు తానంత మూర్ఛజెంది
ఘనశోకంబున నేలబొర్లుచును కడువ్యసనమునొంది
ఉన్నతల్లిని దేసింగునుతా నొప్పుగానుజూచి
కిన్నమూనెను కిదిసమయంబని గ్రక్కునతా లేచి
పరగశంకరా భరణమేటిలో స్నానంబునుజేసి
వడివడి రంగేశునిసన్నిధికి భక్తితోడవచ్చి

## దేసింగు శ్రీరంగనాథుని స్తుతియించుట.

ప. పన్నగశయనా పంకజలోచన పద్మనాభ రారా
వెలువుగనినునే నమ్మితినిప్పుడు శ్రీరంగనాథ రారా
కరుణాకర శ్రీ వరహరిరంగా కామితఫలవరదా
కరిహరిహరి యని మొరలిడవినిచని కరుణింపగలేదా
మునుప్రహ్లాదుని నెలినకరణిని బ్రోవగదయరాదా
ఘనముగ నలనాడాధ్రువుగాచిన గతినేలగరాదా
అనాథరక్షక దీనజనావన సనాతనానిన్ను
వినాగ వేరే దిక్కెదునా మనవినినన్ను
ఘనంబుగను నాయండనుండుమని గ్రక్కునవేడితిని
మనంబునను నిన్నుముఖంబున మరిమరిమ్రొక్కితిని
రంగనాయకా నేనుఢిల్లికి రయమునపోవలెను
సంగతిమీరగ ఢిల్లీనగుఱ్ఱపు సవ్వారిచేయవలెను
తండ్రులఖైదులో నున్నవారిని విడయుక తేవలెను
తండ్రినీవని నమ్మితినాపై దయయుంచగవలెను

నమ్మ్రితిమీరగ నాకుసహాయము సరగునరావలెను
నమ్మిమిమ్మ్రనే ఢిల్లికిపోయెద ననుచు వేడగాను
చయ్యన దేసింగునితో రంగస్వామి యిట్లులనెను
అయ్యావినరా దేసింగానీకతి సహాయంబుగను
వచ్చెదపోయి రమ్మ్రనిచెప్పిన ముచ్చటతోడుతను

దేసింగుమహారాజు మహామత్ఖానునితోగూడి ఢిల్లికిపోవుట

హెచ్చుగమహామత్ ఖానునిజూచి యప్పటవిధములను
తప్పకచెప్పి మనమిద్దరము తగఢిల్లికినేను
తెప్పునపోవలె ననగామంచిది దేవరయన్నాడు
మనకురెండు గుఱ్ఱంబులదెమ్మ్రు మహామత్ఖానుడ
మనఖర్చులకును రొక్కముతెత్తుకో మహామత్ఖానుడ
అనుచు దేసింగుడుబల్కగ నామహామత్ఖానుడును
వినయంబున నా కార్యములన్నిము విశదంబుగాను
తడయకనప్పుడు తనమదిబొంకుచు తయారుచేయగను
వడిగలగుఱ్ఱము లెక్కియునిద్దరు వడిగాపోవగను
పదిదినంబులకు ఢిల్లిపట్ణ మప్పుడు
పదిలముగానా పాచ్ఛాకొలువులో వచ్చినిలచి మోటను
మండివేసికొని సలాంచేసెను మరిపాచ్ఛావునకు
పండితుడగు బాలునికిపాచ్ఛా బదులుసలామనెను
రాజాధీ రాజులనిందరును రయమున జూడగను
తేజంబునగల రాజసింహుని ధీరుని బాలకుని

పాత్షా దేసింగుమహారాజు వృత్తాంతమును విచారించుట.

పాత్షానప్పుడు చూచిబాలుని పరమాశ్చర్యముతో
అచ్చాబహాదర్ తుంకోననగా నటదేశింగుడును
సారెకుపల్కెను పాచ్ఛాతోను సరగచెంజియేలు
శూరసింగుని తనయుడనేను సొంపుగనామేలు
తప్పకవినునే దేశింగుడ మాతండ్రులు నిద్దరును
యిప్పుడునీ ఖయిదులోనున్నారని చెప్పగనిటనేను
వచ్చితిబారా హజారినెక్కగ వచ్చితినిటనేను

ఔచ్చరగనునా ప్రతాపమిప్పుడు చేసెదనేచూడు
చెప్పనేలయా బారాహాజారిని శీఘ్రము తెచ్చినను
తప్పకసవారీ చేసియునీమది మెప్పుజేతుమనెను
అననామాటలు వినియాపాచ్ఛా యాశ్చర్యముజెంది
ఘనసామాన్యపు గుఱ్ఱముకాదది కటకటయనిగుంది
లేచివచ్చియా బాలునిప్రియమున జూచిముద్దుబెట్టి
యీచిత్రముదా నేమనిచెప్పుదు నెందుగానినిట్టి
ఐదుయేండ్లయీ బాలుడెంత యారాహూయుమెంత
కాదువీనిచే నెక్కుటకదిమన కందరమదివింత
పిల్లమాటగా దోచలేదుమరి పెద్దమాటగాదు
కల్లమాటగా తోచలేదు నిక్కమ్ముదోచలేదు
యీబాలకుని వాక్యంబిప్పుడు యిదినిజమనిఎంచి
ఆబారాహాజారినిచ్చట నా రయమున రప్పించి
చూచినంత యీకఱ్ఱుదాని చూచియునేమవునో
బావురేచూపకనున్న నిప్పుడీ బాలుండేమనునో
మించినచింతతో పాచ్ఛానిట్టుల నెంచెనుతనలోన
ముంజెయికంకణ మరయుటకున్నిట ముకురముకావలెను
చల్లకొసంగను వచ్చిముంతదా చంగనేలమనకు
కల్లనిజంబులు రెండునిప్పుడే నెరుగుదుతక్షణమునను
అనియిటులనుయా పాచ్ఛానప్పుడు నాదేసింగునకు
ఘనగుఱ్ఱము చూపించునంతలో తనతనయునిపలుకు
అన్నియానవాలన్ని సంగతులన్నీ తానుదెలిసి
చెన్నుమీరగను శూరసింగు దేసింగుని నటుగదిసి
వరాచిన్న కుమారానీవిట కేలవచ్చితివిరా
పూరకనినుమీ తల్లిటువిడిచి యోర్చియున్నదటరా
నాకులదీపమ నానుకుమారా నాదుతండ్రిరారా
నీకై దేండ్లకు యిచటికిరాగా నేకతముండేనుగా
అనినతండ్రితో దేసింగుడుతా నప్పుడిట్టులనెను
ఘనముగబారా హాజారినెక్కియు గ్రక్కునమిమునేను
ఔరవిడిపించి పిలుచుకపోవను మరివచ్చితిననియు
సరసంబుగనిటు పల్కితండ్రితో జనపతిగమగానియు

ఏలయ్యపాచ్చా మరచితిరేమో యింతలోమీమాట
కాలయాపనము జేయుటమేలా కనుకనామాట
నాపరువునయా బారహాజారి పరువునెరుగలేక
యీ పట్లను మీకింత యోచన యెందుకు యిందాక
అరయకనకము లెన్నియైనా బాలాసమమవునా
బారాహాజారు లెన్నియైనా బాలా సమమవునా
ఒక్కగుఱ్ఱమును పెట్టకనేమో నిక్కదేలమహాశా
చక్కనిఘోడాయైతే చూపుము యెక్కెడభూమీశా
అందరుమోసం బొందించిన యీ చందంబిదిగాదు
ముందుగ గుఱ్ఱము దెప్పించుమనినా ముందరనికమీదు
దెప్పించక నుండితిరేనిక నీదేశాధీశులకు
అప్పణయిచ్చిన యాజ్ఞయెవరిదో యారయ దేవరకు
పలుపరివిధముల బాలుడు పలికిన పాచ్చానవ్వుచును
సరగున నెల్లరగూడుకనా హయశాలకరుగగాను
చూడగ గుఱ్ఱము గర్జన చేసిన సొంపుశబ్దముగను
తోడనె రాజులు గుండెలు పగిలెను పోడిమి చెడియటను
కోటవిరిగి బడినట్టులుండెను నీ వారికపుడు
సాటిగమేఘంబుల గర్జనవలె నరగదోచెనపుడు
చెవులు ఘుమ్ముఘుమ్మనగా రాజులుచయ్యన మూర్ఛిలిరి
దిగులుజెంది వారందరు పుడమిని తెకువచెడిపడిరి
శూరసింగుగ నతనితమ్ముడు సొలసి తలలువంచి
బీరీము చెడిబల్ జెరపగురప్పుడు బెదరియుండజూచి
తెంపునమహామత్ ఖానునిజూచి దేసింగుండనెను
తెంపుగనడిపి చాడిగుఱ్ఱమును తెమ్మువేగమునను
తెప్పనగుఱ్ఱంబునకు బంగరుజీను వేసి తెమ్ము
తప్పకవజ్రాల్ చెక్కినకళ్ళెము త్వరగ వేసి తెమ్ము
అనిచెప్పిన యాసహామత్ ఖానుం డటులతేగా
తనమదిబొంగుచు దేసింగుడు తేజిని తట్టిపట్టవేగా

దేశింగు మహారాజు గారాహాజారి నెక్కుట.

కలకలమనుచును గర్జనచేయుక కదసిల్మియమును
ఘనశౌర్యంబున బట్టగుఱ్ఱమును కదువడినెక్కగను

సింగమువలెతా నగసెనంత దేసింగుడంత
భంగముప్రాణుల నొందించెడిపులి భంగినెక్కినటను
బాలుడైన దేసింగుహాయమును వడిగనెక్కచూచి
జాలిజెందుచు తహతహపడుచును చాలచింతవగచి
శూరసింగుడు తమ్మునితోడను సుతునొద్దకువచ్చి
బారహాజారి నెక్కుటచూచి పరువడినదరుచ్చి
మన్ననతోడ కుమారునిగనుగొని మనమునగుప్పించి
గన్నులనీరును నించుచునప్పుడు కటకటపడిజూచి
తనయానీవీ గుఱ్ఱము నెక్కగ తగదికనిటురారా

దేశింగు బారాహజారి యెక్కగా తన తండ్రియు పినతండ్రియు దుఃఖించుట

చెలువుగపాదూ సెలవుగొని చనుదమిప్పుడురారా
అనినతండ్రితో దేశింగుడుతా నప్పుడిట్టులనియెన్
ఘనమగుగుఱ్ఱము నెక్కగభయపడగ ఖయిదులోమిమ్మిపుడు
పెట్టియుండనే నెక్కియుగుఱ్ఱము ప్రీతితోడమిమ్ము
దిట్టముగా విడిపింపవచ్చి శౌరినేదురమ్ము
ఊరికిపోయిన నవ్వరెవ్వారలు పొసగతండ్రులారా
నేరకగుఱ్ఱము నెక్కగవదలను నిజముతండ్రులారా
సవ్వారిచేసివచ్చి నన్ను చక్కగజూడరయ్యా
వారించకుడీ గుఱ్ఱముచేబడ వగవనేలనయ్యా
మించిమనంబున చింతవలదు మీకుతండ్రులారా
మంచిసవారీ జేయగవలెనే నెంచతండ్రులారా
పుట్టినప్పుడే చావునిజంబని పొసగతండ్రులారా
దిట్టముగా మీమనమున నమ్మను తెలిసితండ్రులారా
అనియిటు పల్కి సలాముచేసి యవుడునిలచినాడు
పనిబూనియు గోవిందాయనుచును పరగజూచినాడు
అంతలోనవా శూరసింగు నటుతనయునిజూచి
యింతచేసుటకు నేలపుట్టితివి యివుడని మదివగచి
తొలుతనుబుట్టిన యప్పుడెచచ్చిన దుఃఖము లేదయ్యా
మెలమితోడమీ తల్లియిపుడు సిన్నట్లువడలెనయ్యా

దేసింగుమహారాజు గుఱ్ఱమునెక్కి దవుడాయించుట.

కలతజెంది యేమయ్యెనోయనగ కదలించె తేజిని వేగ

జలిదియనుచు దవుడాయించెను చయ్యనటుబాగా
పటపటపటపట పటపటయనుచును పరువులెత్తెనపుడు
చిటచిటచిటయసి యెడమకాలికి చిమటయిచ్చినాడు
పోయెపోయెనని రాజులందరు సొక్కుచుచూడగను
పోయయ్యా నీవెందుబోయెదనని యొప్పుగబిల్వగను
వాయుమార్గమున నెగయునప్పుడు వదలకగుఱ్ఱమును
పాయక మేఘ మండలమందు పారెడుగుఱ్ఱమును
నారాయణ గోవిందాయనుచును కోరిపట్టెనపుడు
వారిజాక్షహరి వరదాయనుచును చడికవిడిచెనపుడు
గరుడునివలెనా గుఱ్ఱముపోడవుగ కనువేగమునడిచెరా
ఉరువడిగలిగిన వాయువువలెనె వొప్పుగానుపరచెరా
కొండలనెల్లను కుందుగదాటుచు దొరకోని యెగయుచును
చెందుగనరుగుచు గంతులువేయుచు నెలగిముడుంగుచును
అడవులదిరుగుచు మాకులద్రోయుచు కడువడిదాటుచును
తడవుగతిరుగుచు తలక్రిందుగబల్ ధాటిగబరచుచును
గడువడియట సింహములెల్లను గదలకదిగబడెరా
గూడులనుండు పక్షులెల్లను కొంబకొంబయనిపరవరా
సురలెల్లను దేసింగుపరాక్రమ మొప్పుగగాంచుచును
సరగున బారా హాజారివరచెడి చతురతమెచ్చుచును
అంతటగుఱ్ఱము నాలుగుదిక్కుల వితరణగాతిరిగి
పంతంబున నాడేనూరామడ పరగతిరిగితిరిగి
ఇటువలెగుఱ్ఱం బైదుదినంబులు యెచ్చుగానుచెలగి
తటుకునబాలు పరాక్రమంబున తనమదిలోనెరిగి
ఈబాలునిచే బలహీనము నాకిపుడు గలుగుననుచు
స్వాభావికమును విడచిమాయలో సంచరింతుననుచు
మేరుపర్వతము చెంతనువీనిని కూలగిద్రోతుననుచు
పారెకుతలచియు వెతలబెట్టగా చయ్యనతాగనుచు
తివిరినిద్రయాహారము లేకను దినంబులైదయ్యెరా
దినమునురాత్రియు నొక్కటదిరుగుచు తేజహీనుడయెరా
కన్నులుగిరగిర దిగిరిశోషచే కడుభీతినిదోలెరా
పన్నగశయనుని రంగనాధుని పరువడిదలచెరా

దేశింగు బారాహజారిని పంచుకోజాలక డస్సి
శ్రీరంగనాథస్వామిని ధ్యానించుట

కల్లెముగట్టిగ బిగయబట్టుకొని గనుసు తేజిపైన
ముల్లనమెడతన జేతులుజట్టియు మొదలఃపండుకొని
రక్షింపుము రంగేశాననుసంరక్షింపుములో కేశా
పక్షివాహనా పరమపవిత్రా పన్నగశయనసురేశా
వారిజనాభశ్రీ జనార్ధనాచ్యుతా వాసుదేవశౌరీ
సారెకుభయమును జెందినిన్నునే సన్నుతింతుకోరి
భజియించెద రక్షింపుమునన్ను పరమమానివినుశా
గజవరదాననుబ్రోవవేస్వామీ కారుణ్యముచేత
జయజయభక్తజనావనబ్రోవుము జయజయశ్రీరంగా
జయవిజయాభవ దిగ్విజయాభవ జయవిజయగరుడతురంగ
సుజనగణావన దుర్జనమర్దన సుందరతరవదనా
విజయహృదయ కమలాంతకవాసా వేదవేద్యసదనా
దశరథనందన దశముఖభంజన తాటకసంహారణా
పశుపతినందన పన్నగశయనా పంకజమృదుచరణా
శరణుజొచ్చినవా యరమఱజేతుర సరగునవిటురారా
శరణుశరణుమో కరుణాసాగర కరుణింపగరారా
బిరానరారా వరములొసగశ్రీ కరాయిటులరారా
వరాకేలరా పరాత్పరా శ్రీధరా యిటులరారా
సకలచరాచర సముదయములకును సముడవగనుబరగి
సకలేశుడవై సర్వాత్ముడవై యకలంకుడవై వెలిగి
లేదాదయయిక రాదా శ్రీదామోదర యిటురారా
కాదా బ్రోవగ రాదానీచేతగాదా రఘువీరా
ఏదయనిదయ యేదయరాదయ సాదరముగరారా
వోదాశరథే దయానిధేమో కృపానిధే రారా
మోసబుచ్చి యీహయమిచ్చుటకో తీసుకపోదలచి
వాసిగనున్నది యిదిగోనినునే నదనుగమదిదలచి
భజనజేయుచున్నానని వేడుక భక్తపరాధినుండు
విజయముజేసి దేసింగునితో వెరవకుమనియపుడు
గబిబిజబారెదు గడునుహయంబు నుండుపసిబోనిక

హాయవత్ప్రియమునక జెల్లదునీయు హామడంతుగాక
చిన్నశాలుని చిక్కులబెట్టెడి చెడుగుతురంగమ యివుడు
మన్నించి నీయున్నతినణచి తిన్నగనడుమివుడు
పన్నగశయనుం డనిసన్నుతుగుము. పలువయనుచునపుడు
సన్నుతమునివరుడగు రంగేశుడు చెన్నమీరనపుడు

రంగనాథస్వామి దేశింగునికి ప్రత్యక్షంబై రక్షించుట.

కన్నులచెదరంగ పట్టుపెట్టినను ఘనమగుగుఱ్ఱంబు
మిన్నువిరిగి పైబడ్డటుసిలదేను మేటిదాటిగుఱ్ఱంబు
బాలుని బారహాజారినీవిటు భంగపెట్టదగునా
చాలుచాలునీ చందముదెలిసెను చనగానిట్లగునా
బాలునినీవు ఢిల్లికిదీసుక పరువుగబొమ్మికను
కాలక్షండు భక్తునివిని భయాపదపకనికను
కొన్నిదినంబులకీబాలునిచే గోర్కెదీరునీకు
సన్నుతమవు యుద్ధంబుకొడవుచు చయ్యనవటనీకు
మోక్షమిచ్చెదను జల్దిగరమ్ము ముదమొనవగనసిన
నాతఁడాప్రైనను ఢిల్లిసమీపం బౌమార్గముగపిన
బాలునిశేపి రంగనాయకులు నందయతోడుతనూ
మేలువరంబు లొసగియుధైర్యము మెప్పుగజెప్పగను
అప్పుడు దేసింగును రంగేశున కతివినయంబునను
సరహారి శ్రీహరియని శౌరీవన్నిప్పుడుచేరీ
మరలితెచ్చి మార్గముదప్పక మధుకైటభహారీ
శరణుశరణనను నమ్మితినయ్యా శరణురంగనాథా
కరుణతోనీదాసుని ననుబ్రోవుము శరణురంగనాథా

దేసింగు శ్రీరంగనాథుని యనుగ్రహంబున ఢిల్లి చేరుట

అనినుతియించిన దేసింగుతో నపుడుస్వామియనియె
ఘనుడగుఢిల్లీ పాదుషానగరు కడు వేగముజనియె
మనములరగ బహుమతులుగైకొని మరితంత్రులతోను
చనుము చెంజిపికి రంగస్వామి చయ్యనతోయివను
అప్పుడు బారాహాజారి పాదుషా హజారమటుచేరి
తప్పక గర్జన సేయుకనందరు తడబడియటుచేరి

అన్నకట్టినా గుఱ్ఱంబునుగన కన్నులనీరుంచి
అన్నరార నామున్న వేగనా కన్నులారమించి
శూరసింగుడు బిడ్డనుముద్దిడి చుంచుదువ్వగాను
హారతులెత్తి ప్రఖ్యాతియుడని యానందముతోను
ధీరుండగు బాలుని బాగనుగాని ధృఢమతితో పాచ్ఛా
కోరికలడుగుము నిన్ను మెచ్చితి కూర్చుకు నేడచ్ఛా
మ్లేచ్ఛుండని నన్ను మెచ్చకనుండకు మేలొనర్తగాలా
స్వచ్ఛంబౌసీ చరితనామేల సమకూర్చునుచాలా
నీశౌర్యంబును నీబలములు నేనిప్పుడెరిగితి
కేవలభక్తుల కెప్పుడుభీతియు లేశముకలగదని
బాచ్ఛాపలుకుచు నుండగ తనమది పరమాశ్చర్యమునొంది
స్వచ్ఛమౌ సత్కీర్తిగాంచిన సజ్జనుపొంది
ఉండుము నీవని శూరసింగుడు వొప్పుగ దీవించి
దండిమీరగా వందనమెత్తు తనతొడపైనుంచి
నేనుజేసిన పూజలన్నియు నేడుసఫలమయ్యెగ
కానరాని యాపదలువచ్చి యాకడగదొలగిపోయెగ
అనగానచ్చటి రాజులెల్లను అతిముదమునజెందగ
ఘనుడగుపాచ్ఛా కుమారునిపై కడుసంతసమందెగ
యేలనిబాలుని సింహాసనమున చయ్యన చాలించెగ

ఢిల్లీపాచ్ఛా దేశింగు మహారాజునకు బహుమతులు జేయుట.

రాజలింగశాబును నటజూచి రయమునవిట్లనెను
రాజసింగుడౌ దేశింగునకు వాజులులక్షయును
మాదుకణజముల రొక్కమునిటకు ముందుగదెప్పించు
యేడులక్షల మదమేనుంగుల నిప్పుడురప్పించు
సకలసేనలను దాసీజనముల చయ్యన నిప్పించు
ప్రకటితముగ భూషణవస్త్రంబుల పరగనందునుంచు
అని యీతెరగున నాజ్ఞాపించగ నప్పుడు వేగముగా
చనియెను రాజలింగశాబు సరగున కొల్వుకుబాగా
దేశింగునకీ బాచ్ఛా చెప్పిన తెరగున రొక్కమును
వాసిమీరగ గుఱ్ఱంబులు గజములు వరభూషణములును
దాసులదాసీజనముల భటులను తగురథకోటులను

ఖాసవలోకపు గుఱ్ఱంబును మరి వరవస్త్రంబులను
అప్పుడు తెప్పించినబాచ్చా యతనిజూచి మెచ్చి
తప్పక చెంజీ యినాముయేలుమని యప్పుడె సెలవిచ్చె
నవరత్నంబుల కంఠహారములు తన మెడనువైచి
ప్రవిమల రత్నకిరీటము నప్పుడు బాగుగ నిప్పించి
బహుమతులున్నవి నటువలెజేసి పట్టుశాలువలును
సహజంబగు ప్రేమంబున నిప్పించియు చాలామతి మెచ్చియును
తనగుఱ్ఱంబగు నీలవేణిని నటుకున దెప్పించి
ఘనుడగు మహాత్ఖానునకప్పుడు కడువడినిప్పించి
కొన్నియినాములు మహాత్ఖానునికి కోర్కెదీరనిచ్చి
మన్ననజేసియు నిద్దరజూచి మదిలోమెచ్చి
చయ్యన రాజలింగబాబును నెయ్యమొదవ జూచెగా
ఒయ్యన నవుడాతనితో నాతను ఓహోవినుమనియెగా
రమ్మువీరితో గూడిపోయిరా రాజలింగబాబూ
రమ్ము చెంజికి సేనలబంపుము రాజలింగబాబూ
రాజులందరు చాలదినములు రాయుడిబడిచెడిరి
తేజసపంబున గావునవీరని తెప్పుడవిమజారి
అనితమతమయేలెడి పరగణాలయిన దేశములు
ఇనాముసిదిగా ననుభవింపుడని యిమ్ము వుత్తరవులు
పెరవుమీరగా నిటువలె జెప్పగ సరగున నాతడును

దేశింగుమహారాజు తండ్రులను బిలుచుకొని
బారాహజారితోడ చెంజికివచ్చుట.

పరువడినట్లనె చేసెనుబాచ్చా బాహ్యోయనగాను
మరిదేసింగుడు తండ్రులతోడను మహాత్ఖానునితో
త్వరలో తమతమ గుఱ్ఱములెక్కియు తరలిరిసేనలతో
పదిదినములలో చెంజికి జేరిరి బహువేడుకగాను
మరి సంతసమున నూరివారలు మరిమరి పొగడగను
వచ్చిన బాలుని జూచుచునుండిరి వరుసగ నందరును
మచ్చటతో దేసింగునితల్లిని ముదమమీరగనెను
మొత్తిప్రీతితో ముద్దులాడుచును తోయిరనాతడా

ఇన్నిదినంబులు నెచ్చటనుండితి వేమిరను కుమార
చన్నులపాలు చేదెనప్పుడు చయ్యన సుకుమార
అనుచు సుతునకు హారతులెత్తె నప్పుడు రాంభాయి
చనువున ద్రిష్టి తీసెనప్పుడు నరగున రాంభాయి
దేసింగుడు నందరుగూడుక యంతఃపురమాన
ఆదర మొప్పగ తల్లి చెంతను మోదముతోనున్న
యువరాజుగ నా దేసింగుని హాళొప్పగ భావించి
ప్రవిమల కీర్తిరొయొసంగ వెలయుమని పట్టముగట్టించి
యేకొదవలు లేక సుఖాఉండగ నేహోయేమన
ఆకుమారుని తల్లిగలించిన సంతటదుఃఖమున
హొగడుచు పరలోకక్రియలెల్లను బుధులు మెచ్చగాను
తగనొనరించెద దేసింగుడును ధర్మరీతిగాను
బాలునికష్టము వత్సరంబున పరమావదంబునను
కాలవశంబున శూరసింగుడు కడగిపోవనటకూ
చుట్టములెల్లను వచ్చివగవనా శూరసింగునకునూ
అట్టియొనర్చెను పరలోకక్రియ లందరు మెచ్చగను

దేశింగుమహారాజు రాజై రాజ్య పరిపాలనంబు జేయుట.

నరగున దేసింగువకప్పుడు పురజనులు మెచ్చగను
ధరణిసింగుడు పట్టముగట్టెను తద్దయుప్రియమునను
చనువుజజనముల పరిపాలించెను చయ్యననాతడును
ఘనమతి దేసింగుని భూషింపగ గడగిరిమల్లరును
ఇటులొన్ని సంవత్సరములును హేగగనంతటను
తటుకున ధరణిసింగుడు మంత్రుల బిలిచియును
ప్రభువా దేసింగునకు పెండ్లిని పరగజేయవలెను
సభగలవారలు నందరుగూడి చయ్యన నివ్వుడును
ఆలోచనలును చేయగవలయు మనవిగూఢంబుగను
బాలుండయ్యెను బుద్ధిమంతులు పరగజూడగాను
మన దేసింగునకు పెండ్లిచేయవలె మంత్రులారమీరు
మనపట్టణమున్ను శృంగారింపుడు మంత్రులారమీరు
అప్పుడటులంచును ధరణిసింగుడు హితవుగాను

తప్పకబల్కగ నట్లొనర్చిరి యొప్పమీరగాను
పరగనప్పుడె చారులవలనను ధరణిసింగురాజు
అరయగ నా దేసింగునిమామను ధరణిసింగురాజా
విహితముగా నప్పుడురప్పించియు వేడ్కమీరగాను
మహినొప్పగ మన దేసింగునకు మదిముదమొదవను
పెండ్లిచేయగా వలెనని మేము పెద్దలగూడుకొని
పెండ్లికూతురు యెవరనిమనమున పెరతలవులుమాని
మీ పుత్రికను తెచ్చివివాహము యేవుమీర జేయన్
యీ పట్లను నిశ్చయము జేసితి మిక నాలోచన జేయక
మీరు జెప్పిన మేరకు జేయగ మేముసిద్ధముగ
చేరియున్నారము యిప్పుడు మీ కోరికేమియ నెను
వినియునాతడును నందుకొడబడి వేడ్కతోడనపుడు
తనపురంబునకు నరిగియువృత్తాంతంబు నెల్లనపుడు
యెల్ల వారికిని తెలియగ జెప్పి యుల్లమలరగాను
నల్లలితంబుగ పుత్రునిదోడ్కొని చెంజి జేరగాను
అకలంకంబగు పుత్రుని నెదురుగ సకలబాంధవులును

దేశింగురాజునకు ధరణిసింగు వివాహంబు జేయించుట.

సకలజనంబులు సంతసించగా నవరించినంతటను
నడువగధరణీ సింగుడువచ్చి విడుదులుచూపించి
కడుమేలునునగు శుభముహూర్తంబున కల్యాణంబొనరించి
బంధుమిత్రులు బ్రాహ్మణజనముల బహువిధముల మన్నించి
సైంధవమ్ములు గజములురథములు నరగ వారికిప్పించి
మరియానగల్గిన నటభటాదులను నరిమురి ప్రియమంద
పరగనొనర్చియు ధిరణిసింగుడు చాల వేడ్కనొంద
కనకమయంబులు బుణిమయమునునై కడుశోభిల్లగను
దివకొకతేజము మీరు కాంతిని తేజరిల్లగాను
వాద్యఘోషములు మ్రోయుచునుండగ వరుసవీధులంత
దేసింగుని మామయు తానంతట దివ్యరథంబులను
వాసిమీర గుఱ్ఱంబులు గజములు వరుసధేనువులును
కూతున కనణాంబిచ్చియు తనదగు గృహంబుజేరుటను

ఖ్యాతిగ నేగును బంధులవీడ్కొని కడువడిఘూరదూనము
సంతసంబున దేసింగుడు అర్కాలగెలుచుచును
పంతముమీరగ పరిపాలించెను బంధులమిత్రులాను
యీరీతిని సుఖమొందుచు చెంజిలో సారెకు నందరును
భూరిసంతసం బొందుచుండిరని నారదుడనగాను
వినిసురనాథుం డతిమోదంబున వేడ్కలుప్పతిల్లగా
ఘనుడగు నారదు జూచి పల్కెను కడుప్రీతితో వేగా
ఆవలికథ యేమాయెనుదెల్పుము అవనిలోనస్వామి

ఢిల్లియా పాచ్చా తన కొమార్తెను సాదులానునకి పెండ్లిచేయుట.

సావధానముగ జెప్పెదవినుమా సకలము శేశేస్వామి
సంతోషమున ఢిల్లీ బాచ్చా స్వంతకూతురుని
అంతట పెండ్లి చేయవలయునని యావలతలచెను మదిని
తన ప్రధానియా రాజలింగని తప్పకవుడుజూచి
ఘనముగ పెండ్లిచేయగా మనమున కడునిశ్చయముంచి
ఉన్నవాడను పట్టణమెల్ల సవొప్పగ వేట్కవును
మెన్నో విధముల శృంగారింపగ యివుడు బంపుమనెను
చోద్యముగా నగిరెల్లలు మరిమరి సొగసుచేసియుండు
సాదుల్ ఖాన్ సాహేబునప్పుడు చయ్యన బిలిపించి
మోదముతో తనపుత్రిని వానికి ముదమున పెండ్లిరొయనర్చి
అల్లునికి కూతురికి యప్పుడు అధికధనము లిచ్చి
కొల్లలుగా నేనుంగులు హయములు కోర్కెదీరనిచ్చి
కోరినవస్త్రంబులు భూషణములు కొంతసైన్యములను
వారికి దాసీ దాసజనంబులు నవరత్నంబులను
వ్రాసి యిచ్చెను పద్మానాయోగ్ రాజ్యమేలు మనుచు
వాసిగకూతురి నల్లునికిచ్చియు వరుసవేడ్కజూతు
పూగమొనిమిది పాశాల్ తుకడీ సేటుగజేయుంచి
వాటంబున తనకూతురి కరణము దీటుగనిప్పించి
సాదుల్లాఖానుండగు తనయల్లుని చక్కగానుజూచి
మోహముతో నార్కాడు యేలుమన ముదముతోడవచ్చి
సాదుల్లాఖానా సాహేబు మెంతో సంభ్రమంబుతోను

ఆదరముగ తనవారితోగూడి యార్కాడ్ జేరగను
మేడులతుల పరాణీయులను యేరవరచెనపుడు

సాధుల్ ఖానుడు ఆర్కాడు యిలాకాకు ప్రభువగుట.

వాడిమిగా తేగాబరిశీలను వారికిచ్చునపుడు
ఖావన్యమీరులను రప్పించియు పట్టము గట్టించి
ధావళ్యంబై నట్టి కేతనము తప్పక నెత్తించి
బాల్లేయుతే రహిమాన్ తుపుపులు భర్తి జేయించి
నమ్మకవారాం నైకర్మయుని నమ్మికపుట్టించి
ముల్లాసాత్రము పద్ధతి వారికి మాలము వారిదెల్పించి
ఉమ్మగుఖాన్ అనివొడి వానిని పుజీరుగానుంచి
బారకాను బంగాళాలయములు బాగుగ కట్టించి
వాదుపనాపరి చేడిగోడలు బాగుగ బెట్టించి
ఢిల్లీ మక్కా దర్వాజాలు ఠీవిగ నేర్పరచి
ముల్లాపీరు హిమామదిండ్లు మాలలుగావించి
దక్కమహాలుబల్ షాడీమిహాడీ దర్బారుగనుంచి
యుక్తముగాని దివానుఖానా లూర్జితంబు జేసి
వీధివీధులను మసీదులెల్ల వెలుగుచుండగాను
బాదరు వుంకావుఖాజిల్ నమాజుచేయగాను
యక్బరు అల్లాకుదాయటంచు నచట వేడగాను
నిగనిగమునికందీలు గ్లోబులు ధగధగ వెలుగగను
దాటిగనవలకోటబెట్టి బావాటముగాగాను
నేటుగతాను కోటజేరి బల్యాటముమీరగను
రోజినాలుకై జీతమ్ములు యూడిగనిచ్చుచును
అజా బాజా వల్లెలయందు అమల్ దార్లనుంచుచును.
మహాయారిజా దేలుచునుండె నవాబుసాదుల్లా
సభామధ్యమున తాగూర్చుండి జాగ్రతతో నెల్ల
కిల్లెదారుల జాగ్రతజూచి కిలకిలయుని నగుచు
బళీయినాము లవుడిప్పించి హైటోజియునుచు

సాదుల్ ఖానుడు పరగణా లెక్కను తనికీజేగూట

రాజితవాజము లివ్వగాను తానే ప్రభువగుచు

నాజర్ మొదలగు నుద్యోగస్థులు నయముగ గొల్వగను
నవుకర్లనుజూచి యప్పుడెబల్కెను నవాబుదొరగారు
శ్రీకాపటురయా ముసద్దీలను లెక్కలడిగినారు
సీమామూలవు జమీందార్ల చెల్లుబాకీలేమి
జోబులోపల తయారుజేసుక జాగ్రతగారమ్ము
తుదమొదలుగ లెక్కలు తానెరుగును తోండ్రమల్లోజి
ముతముఖబిల్వగ బంపుడనంగను ముందుగానుఖాజీ
చోబ్దారులను గనుగొనియప్పుడు జోరుగనాతనిని
మా త్తలలేదు తోండ్రమల్లోజి మలగకు వేగమని
తోడుకరండు సాదుల్ ఖానుని తుర్యముగానపుడు
పోదిమితోడుత బల్కగవారు పోయిపిల్వనపుడు
తమకంబుని చౌడంగీల్ దొడగియు తలపాగాబెట్టి
నమామురైదా జల్తరుపట్కా నడికట్టుగకట్టి
కొలువైయున్న నవాబుకడకును గొబ్బునవచ్చియును
సలాముచేసి భయభక్తులతో సంకటనిల్వగను
తొందరవలదిక ఖైటోఖైటో తోండ్రమల్లోజి
ముందుగాన పాళెంబులపాకీ మొత్తము తేర్పరచి
అరనిమిషములో బాకీలెక్కలు మెరుగజెప్పు తెరచి
దొరతోనప్పుడు మనవిజేసెను తోండ్రమల్లోజి

తోండ్రమల్లోజి నవాబునకు కిస్తీపన్నులు లెక్కలు వివరముగాదెల్పుట.

తప్పక లెక్కలు శోధించితి తప్పేల్వారిగను
ఇపుడు నెంబరు చొప్పునమీకు యికవివరించెదను
చేతిపట్టు దావుల్ ఖాన్ బాకీ చెల్లియున్నదిపుడు
పాతపాళెవు జాగీర్ దారుడు బాకీలేదుయిపుడు
కళ్ళకురంజి ఖాన్ సాహేబు ఖానుబాకీలేదు
కళ్ళికోట మహమ్మల్ ఖాన్ బాకీ చెల్లుబెట్టినాడూ
అరియలూరి పాళేగార్బాకీ యేర ఖానునులేదూ
తిరువణ్ణామలెరెహెల్ సుభంగిదొరయును తెలియ బాకీలేదూ
దిండికల్లుకోలు మొక్తాన్ బాకీ తెచ్చి తేర్చినాడూ
బండికోట జాగీర్ దారుడు బాకీదీర్చినాడూ

చెంగల్పట్టు జమీందార్ బాకి చెల్లిపోయెనేడూ
మంగళపేట సుబేదారుడు మన బాకియిచ్చినాడూ
వెంకటగిరి బంగార్నాయుడు యింకా బాకిలేదూ
శంక లేక మలయాళపురూకలు సరిగవచ్చెనేడూ
కలవకోటమేల్ సుబేదారుడు కాసు బాకిలేదూ
చెలువుతో కాళహాస్తి పైకము చెల్లించిరినేడూ
తిమిరికోటమేల్ సుబేదారుడు కాసుబాకిలేదూ
చెలువుతో కాళహాస్తి పైకము చెల్లించిరినేడూ
తిమిరికోటమేల్ షేకుమహమ్మదు తీర్చి వేసినాడూ
అమరిన కార్వేట్రాజువారును అరయ బాకి లేదూ
నారగంటి పాళెంబుల బాకి అరయంగను లేదూ
ముగరాల్పాలెపు కిస్తిరూకలు ముందే చెల్లినాది
ముగలిపాళెదార్ పైకముమనకు తగరారనేది
నిలిచినపాళాల్ పైకము బాకి నేటివరకు లేమూ
చెలువుగ కిస్తీ కట్టలేదు దేసింగుమహారాజువారు
చేయుచు పండ్రెండేడులనుండియు చెల్లించెడు పైకమును
యీ మొదవానిని మట్టుబెట్టుట హితమనియనగానూ
కన్నులనిప్పులు రాల్చుచుమిక్కిలి యున్నతుడై యంతా
పన్నగ సాదుల్ ఖానుడుగ్రుడయి పలికెవానికంతా
సబాష్ వహ్వా బాగజెప్పితివి యీ సారిబల్కవోయీ
యీ బాకి తృణమైనా నేనట యికనునిల్పవోయీ
అనుచుమీసము ద్రిప్పుచువుక్కు సప్పబట్టుచును
కనుబొమలదరగ భుజములుగదలగ ఘనముగబల్కుచును
గుప్పుగుప్పుగుప్పని తనకన్నులు నిప్పులురాలగను
అప్పుడు పండ్లను పెట పెట పెట పెట యనుచునుగీటుచును
మనకును పైకముకట్టకయుండే మదగర్వంబేమి
తనకును చెంజికోటయినాముదక్కవ యికనునుమీ

సాదుల్ ఖానుడు తోండ్రమల్లోజిని సైన్యసమేతముగా
చెంజికోటకు పంపుట.

అనుచు మంత్రియగు తోండ్రమల్లుని కనుగొని తానవుడు
దినములు మూడును గడువిచ్చితిమి తీవ్రముగానవుడు

చెంజికోటకును పోయి పైకమునుం శీఘ్రంబుగాదెమ్ము
సంజమైన దేశింగుని సీవిటు పట్టికట్టితెమ్మా
అని కోపముతో నబాపు సాదుల్ ఖానుడు పల్కగను
వినియును తోండ్రమల్లోజప్పుడు వినయముతోడుతను
పూనిసలాంమటు చేసిన బాబును పొడగనియిట్లనెను
పూనికతోడుత చెంజికోటకును పోయివత్తుననెను
మూడువేల గుఱ్ఱంబులు రౌతులు నేడు పటాళములు
వాడిమిగల తేగాబరిగీలును జోడాఫేరులును
ఏనుగులుగ విల్బండ్లు నొంటెలును హెచ్చువాద్యములును
సేనాధిపులు ఖజానాధారులు నానావిధములను
సకలమైన సంభారంబును చాలరొక్కలును
వొకటియు తక్కువలేకుండగ నాకొప్పగనిచ్చినను
శీఘ్రముగాను చెంజిలో మనకు జేరు పైకమంతా
జాగ్రతగా గొనివచ్చెద చూడుడు చాలగ నొకవింత
పట్టికట్టెదను దేసింగుని బల్వారాలుండగను
గట్టిగ నిర్బంధముతోడను ఖయిదీ చేసెదను
మించని కార్యము వానిపై నడిపించెక నచ్చటను
మించియున్న నొకవేలలో వానట్రుంచెద తెగతోను
ఇటులపల్కిన తోండ్రమల్లుని యింపుతోడజూచి
నటులపరాక్రమ లయిన బలంబుల సరగనియ్యలేచి
తోడుగూడుకొని సలాముచేసి తోండ్రమల్లోజి
వేడుకతోడను నుత్తరువివ్వగ విడిదికి నతడొచ్చి
నిలువంగీల్దొడగియు తలపాగా నేర్పుగానుజుట్టి
జలతరుపోటుకట్టి నడుముకు చక్కగానుగట్టి
తళతళమను జేమఝ్జానంతట దట్టిలోన జెక్కి
నిలువుటద్దమును జూచిమీసము లెరయదీటినిక్కి
చేతులబట్టి నాయుధంబులను శీఘ్రముగాబట్టి
ఖ్యాతిగ నేనుగు నెక్కియు సేనల గదలక నిలబెట్టి
పెంపుగ ధణధణధణధణయనగను భేరీవేయించి
గుంపుగ పటపటపటపటయనగ గుఱ్ఱముల్నడిపించి
కత్తులు ధగధగధగధగమనుచును కాంతులుశోభిల్ల

తత్తరమందుచు నెల్లజనంబులు తరుగుచుభీతిల్ల
ఇలాతలం బిట్టట్టుగదలగా యెవుమీరవేగా
కలకలకలకల కలకలమనుచును కాల్బలములురాగా
వేంద్రతంబుగ జనముల నడిపించెను తోండ్రమల్లోజీ
తీంద్రించుచును గదలెనప్పుడా తోండ్రమల్లోజీ
అని నారదముని వచ్చెడప్పుడెకా నానతియ్యగాను
విని దేవేంద్రుడతనితోడుతను వెరగున నిట్లనెను
మునినాథావిన వింతగనున్నది ముచ్చటజూడగను
పనియేమీ యీ నవాబు చెంజిపైకమడుగుటకును
కోటఢిల్లిలో దేశింగుమహారాజు గుఱ్ఱముపై నెక్కి
సారెకు స్వారిచేసినప్పుడు చయ్యనమదిసొక్కి
తెగువతో పాద్చా చెంజియినాము దేశింగునికిచ్చి
తగబంపగ దేశింగుడు తాను మగుడ చెంజికొచ్చి
యేలుచుండగ యీనవాబుకు యిపుడు బాధ్యమేమి
కేలని చెంజిపైకము నడుగగ మేరమీరనేమి
కారణమున్నది కడువడిదెల్పుము నారదమునివర్యా
కోరెదవినగా వారిచరిత్రము గొనకొనిధీవర్యా
యిప్పుడున్న నా యింద్రునిజూచి యెప్పుడిట్టులనియెగా
తప్పనారదు డావిధమెల్లను తడయక వినుమనియెగా
సురనాయకా యీ ఢిల్లిపాదుషా సొంపుమీరగాను
గరిమతో చెంజి దేశింగునికి వరుసయినాముగను
యిచ్చిమరచియు నల్లునికి నూటయెనుబది పాళెములు
మచ్చికతో పర్మానాద్రాసి మరియునిచ్చె మేలు
ధర్మము నెంచక లేటుకుననప్పుడు తనమదిమూడుతను
పర్మానాలో చేర్చెను చెంజియు వదపడిచూడగను
గరిమతో సాదుల్లానుడుపైకము కట్టలేదటంచు
అరయగ దేశింగుని యడుగుటకాదరు విధియేయనుచును
నారదుడిట్లని చెప్పినయా పాకారిమదినిమెంచి
సారెకునల్లుని కెటువలెనిచ్చె చయ్యనపాదుషా మెచ్చ
మరిచెప్పదవినుసురనాయకయా తురకదొరతనమున
ఇరుకునవడగులుంట గలియగలేదు కొట్టిపోరలుతయిన

అనిచెప్పిన మునివరుమాటలు వినినంత నింద్రుడనియో
చనెనుగదా యాతోంద్రమల్లుడా పనియేమిగనయ్యో
రూఢముగా దెల్పుము నీవనగా ద్రుహిణపుత్రుడనియో
గాఢము భేరీ శబ్ధముతిమిరికి కడువడివినబడియో

## తిమిరికోట షేకుమహమ్మదు తోంద్రమల్లుని జూచుట.

తిమిరికోటయేల్ షేకుమహమ్మదు దిగులుజెంది లేచి
క్రమముదప్పి పరులెవ్వరో మనపై కదసిరనుచు జూచి
మాడువేల గుఱ్ఱంబులనపుడు మోహరంబు జేసి
తోడనెమున్నూర్ పఠాణిరౌతులు దోడుగాను జేసి
కత్తిపట్టు కాల్బలములనెల్లను క్రమముగాను నుంచి
బత్తినాయుధములు తానప్పుడు బత్తిగధరియించి
తానొకబారా హాజారిని నెక్కి కదనుగదలించి
పూనికతోజని తోంద్రమల్లుని పొందుగాను జూచి
ముందుసలాము చేసియునిలిచి యందుక్షేమమడిగి
తొందరసేయగ వలదటంచును తోంద్రమల్లుకడిగి
మొన్నటివరకును బాకీహూకలు మునుపంపితినన్న
నిన్నటిలెక్కలు యివెనన్నిప్పుడు మన్నించగదన్న
ఇదియునుగాకను నాపై తప్పులు యేమియున్నవన్న
కదలియపుడు నాకోటపైకిరా కారణమేమన్న
అనియీవిధమున నడుగుచుభయమున నడుగులు తడబడను
కొనియాడుచుమరి వేడినతిమిరికోట మహమ్మదును
గజిబిజిమాంచి తోంద్రమల్లుడు గ్రక్కున నిట్లనెను
నిజముగ షేకుమహమ్మదు వచ్చుట నీపై గాదనెను
చెప్పెదవినుము చెంజియేలు దేసింగురాజు మనకు
తప్పకపంద్రాడేండ్లపైకము నివ్వ[illegible]టుటకు
మొండొడ్డియున్నాడిపుడా యీమెర దెలియలేదు
దండుతీసుకొని పోయెదనికనా తమాషెనచూడు
అనవిని షేకు మహమ్మదుడంతట నతిభయమొందుచును
ఘనుడగు నాదేశింగుని ప్రతాపము వినుమికజెప్పెదను
బలమున నెక్కువ గలవాడయ్యా బాలుడు దేసింగు

యోలమిని యెదిరించిన నిమిషంబున నణచువానిపొంగు
కత్తిచేతబట్టిన జగజెట్టిల్లను గడగడమనివణకు
మిత్తిరీతివైరులగాబట్టి మెలగనీకచణకు
కండ్లనురిమి చూచినమాత్రంబున కరుగుగర్భమున్న
పండ్లు పటపటకొరుకునంతలో పరుగెత్తుమువన్న
దుధుకడు రాజితసింహంబనదగు తోండ్రమల్లన్న
కదుమిని దేసింగునియెదిరించుట కార్యముగాన్నా
అనవిని తోండ్రమల్లోజప్పుడు మేలయింతమాట
అనవచ్చునె నాముందటపేకుమహాన్మాను నీవిచట
కనిదానీవీమార్గంబుననే కదలిరాగా బాగా
వట్టిప్రతాపము లేటికిపోయి వచ్చెదమిది వేగ
అట్టి దండునడిపించెదననుచు ఆరణిమార్గముగా
పోయియారణి పొంతకుజేరి బాసగ భేరివేయు

తోండ్రమల్లోజి జింజిరికోటనుండి ఆరణికిపోయి రణభేరి వేయించుట.

మాయురెయీధ్వని యేమియటంచును మనమునదిగులొంత
రయమున వెంటత్రావును శ్రీధర రావునుసచ్చటను
రయమున శ్రీనివాసరావుతో నటచదురుండియును
పిడుగురీతినున్నది యీనాదము పెల్లుఘోరముగను
గడగడవణకెడు కాళ్లుచేతులను కడుభయ మొందెడను
కారణమేమొ తెలిసియువేగమె కట్టా యెత్తుముగా
బారాహజారుల గొని తెండిప్పుడె పటురయమున బాగా
అనియిట్లారణి వేంకట్రాయులు తనపరివారముతో
చనుసటునాజ్ఞయొనర్చియుతాను సరగునకోటమహల్కు
శ్రీధరరాజు మొదలగువారితో శీఘ్రంబుగనెక్కి
ఉధరబదులుగ భేరీవేయుచు యెవ్వమీరనెక్కి
చూచుచుదిక్కులు పిక్కటిల్లగా సొంపుతోడనపుడు
యేచివచ్చు సేనలధైర్యంబును జూచివారలపుడు
వ[illegible]యిరాజదో వచ్చెను కోటపైకి చూడుడనుచు
పరాకులేకను బారాహజారుల బిరాన తెండనుచు
అప్పుడందరు తమతమగుఱ్ఱములపైన నెక్కియును

తెప్పున బలములు తాముగూడుకొని తేకువ నడువగను
పదివేల్ రౌతులు కూర్చుకబందోబస్తీగాను తాను

## ఆరణి వెంకట్రావు తోండ్రమల్లోజిని పొడగాంచుట.

కవిసము వెంకట్రాయలు తనచేతికత్తి మెరయగాను
నెదురుగపోయి తోండ్రిమల్లుని యేమరక జూచి
ఇదియేమి యిటురా కారణమని యిపుడనుచునుజూచి
తుదమొదలేమో మీరువచ్చుటకు తోండ్రిమల్లోజి
సదయత జెప్పుము సంగతులెల్లను చయ్యన మల్లోజి
అనుచును వెంకట్రావు నమస్కారంబు చేయగాను
వినయముమీరగ తోండ్రిమల్లుడును వేగయంతటను
బదులునమస్కారము తాజేసియు కుదిరికతోడుతను
చెదరగనివ్వగ వెంకట్రా కూడు ముదమున నిట్లనెను
నిన్నటివరకును లెక్కలుతీర్చియు నేనుబంపినాను
మొన్నగ నేటిపైకంబు పుల్లైయును నేడేపంపెదను
ఇటులనుండగా భేరీవేయగ నేమికారణంబు
తటుకున దెల్పుము తోండ్రమల్లున దాచకనునిజంబు
తోరంబుగ నాతనికిట్లనియెను తోండ్రిమల్లోజి
వేరేమేము వచ్చినవిధము వేంకటరావోజీ
చెప్పెదవినునే సవిస్తరంబుగ చెంజికోటలోను
వొప్పగపండ్రెండేండ్లపైకము వున్నది యిచ్చుటను
కట్టలేదు దేసింగుడు మనకు కాసైనను యివుడు
మట్టుమీరి యున్నట్టివాడగు మదగర్వమునేడూ
చూచిపైకమును దెచ్చుటకై నేసాంపుగబోయెదనూ
నీచుడయిన దేసింగునిబట్టియు నిటకుదెత్తునేను
ఆమాటలువిని వేంకట్రాయులు నాతనిచర్యంబును
సామాన్యంబని యెంచతగదిక చయ్యన జెప్పెదను
తల్లి దండ్రిలేడిమిదియేండ్లకే చెలిపోయినారు
పిల్లవాని పినతండ్రియూసాకి పెండ్లిచేసినారు
ఇరువదిరెండుయేండ్లవాడయా యిప్పుడు దేసింగు
సరియగుదురె సుందరమున భువిలోచక్కదనాల్ రంగు

## తోండ్రమల్లోజికి ఆరణి వెంకట్రావుకు దేశింగుమహారాజు. ప్రభావమును దెలుపుట.

గరిమతో వానిపరాక్రమము నీకెరుగ జెప్పెదను.
ఇరవుగ దేసింగునకును సరిశూరులెవరు లేరు యికను
పదినేల్తులముల మొత్తుకత్తిచే పదిలంబుగ దాల్చి
పట్టపడి యెనిమిది వేలతులంబుల బాలాధరియించు
మూడుమణంగుల పేష్కబ్జాతన మొలధట్టిని జెక్కి
గారంబగు ఉక్కుజీరాదొడుగగ రూఢిగానునిక్కి
ధరగలవస్త్రాదుల లోపలను తనరు మేటివారు
అరుదుగ దేశాధీశులకెల్లను అరయపోటుగాడూ
ధక్కరించి చూచిన మాత్రంబున నుక్కుగుండ్లుపగులు
చక్కగనిలిచిన వీరులగుండెలు ప్రక్కలుగానొగులు
దేవలోకమందుండివచ్చిన తేజతనికిగలదు
ఆవిధమంతయు దెల్పెదనచ్చట నేవినకనలేదు
గోగుపక్కిరి ఢిల్లినబాబుకు గుఱ్ఱకొని తెచ్చె
బాగుగ గుఱ్ఱంబిగిలించి తూగినేనవిచ్చె
పాచ్చానప్పుడు మూర్చ తెప్పరిలి పక్కిరునిజూచి
ఆచ్చాబహాదర్ ఘోడాతుంకో అనగవాడు లేచి
సలాంమహారాజ్ బాచ్చాయిదిగో సలామయ్యనీకూ
హాలేమాం తురిఎచ్చెదబహుమతి మాతీయుమాకు
రహిమీరగ మహుమతిపక్కిరికి రాజలింగబాబు
సహజంబున నిప్పించి వేడ్కతో సరగునపనిచెనబాబు
వాసిమీరిన గుఱ్ఱము నెక్కెను రాజలింగబాబూ
దేశాధీశుల బిల్వబంపుము రాజలింగబాబూ
అనియిటుపాచ్చా నానతియ్యగా రాజలింగబాబూ
పనిచెను హర్కారుల దేశములకు రాజలింగబాబూ
అప్పుడువచ్చిరి పాళెగారు లాహాయమునుజూడగను
వొప్పుమీరగా వచ్చియున్నారా మెప్పులగుఱ్ఱమును
తప్పకచూచియు దాసగర్జనకు తగభయంబుజెంది
చొప్పడదీగుఱ్ఱము మాకెక్కను యిప్పుడనుచుగుంది

మొగములు వెలవెల బారగనందు మోదంబులుదరిగి
వగలబాగలగ రాజలింగబాబ గణితముగ నెరిగి
పదిలుడైన దేసింగునితండ్రిని పరగబిల్వబంప
కదలెను ధరణీసింగునిగూడి కడుముదముజనింప
చేరిఢిల్లిలో తేజినిచూచి చేతనెక్కటకుగాక
వారిరువురు కైదునపడి రైదుసంవత్సరములవరకు
తెంపుతోడనై దేండ్ల బాలుడోయి దేసింగుమహారాజు
సొంపుమీర తేజిపై నెక్కెను చోద్యముగారాజు
అంపరబాడగ మటుమాయంబై యైదుదినంబులకు
పొందుగదవుడాయించియు నటనటపొందగ తనమదిని
దినకులదైవంబగు రంగేశుని దలచియురాగాను
తటుకున స్వామియుఢిల్లిలో తేజితోచక్కగవిడువగను
చిన్నబాలుని చోద్యముమదిలో నెన్నుచు తేజీని
పన్నుగ పాచ్చాయినామిచ్చితా బంపెను తేజీని
ఆగుఱ్ఱముపై నెక్కక దేసింగంత చెంజీ జేరి
భాగంబున దేవేంద్రునితీరై పొంగినాడుమీరి
తుడకుండాగుఱ్ఱముపై నెక్కిన తోండ్రమల్లన్నా
గణగణవణకును యీజగమెల్లను కదలవలదన్న
ఉసురువున్న వుప్పమ్మవచ్చును వూరికిపోవన్నా
రసికుడయిన యీ దేసింగునికో రచ్చలువలదన్న
పరిత్యతుంబున రంగనాయకుడు పలుకుచుండునన్న
నిత్యము తిరుమణిధారులగన్న నీతివినయుడన్న
తోడనె యీ మాటలువినినవ్వెరు తోండ్రమల్లోజి
వేడుక మించెను నీమాటలచే వెంకట్రావోజీ
తిరుమణి నేనుధరించుకొని దేసింగునిగాంచి
వెరవు లేక వానినియిటు దెచ్చెద వేగమోసగించి
పోయివచ్చెదను చెంజికనుచు తా ప్రేయించెను భేరీ
బాయక త్వరితంబుగయీ చెంజిపట్టణంబు జేరీ

తోండ్రమల్లాజి చెంజికోటనుచూచి విస్మృతినొందుట.

కోటను ప్రాకారంబుల కడైలుగోపురంబులను
వాటమైన మహాడిలును మరియుమేటిపడిగలను

రచ్చతిన్నెలు చలువచప్పరాల్ రాజవీధులును
హెచ్చుగ బ్రహ్మక్షత్రియవైశ్యులును మెలమిని శూద్రులును
వివిమీరగా వీధులందిరుగు వీటి ఇతర జనములనూ
భావము రంజిలచేసెడి వేశ్యా భామజనంబులును
దేవాలయములు దివ్యతీర్థములు తేజరిల్లగాను
కోవిదులచ్చట శాస్త్రాగమములు గోష్టి సల్పగాను
ఘాటిమీరు నుద్యానవనంబులు తేటతటాకములు
పాటిగ శుకపికరవములుగలదు పారావతములను
తేజమలర నవరత్నపుకాంతులు దీటుగ వెల్గగను
రాజధాని యొప్పుగవిలసిల్లెను రంజితంబుగాను
చటులతరంబుగ దుర్గంబును తా నటుగనితలయూచి
తటుకున వేంకట్రావుదెల్పిన దాకల్ మనినెంచి
ఇటువిలసిల్లెడు కోటజూచితా మెచ్చుగగొనియాడి
పటుతరముగ నేవిధమునసాధింపగ నేవరినిగూడి
దండును దేవతె నూరిదగ్గర నుండగానుబంచి
ఖండితముగ దేసింగునితోడను కదసిపల్కి వెరచి
కయ్యక నాలుగుదినములుదాక నెయ్యడనుండియును
చయ్యన బోవుటకును తానంతట సందేహించుచును
భేరీ వేయించెను మరునాడా భేరీశబ్దమును
సారెకునప్పుడు పాతచెంజికి చయ్యనవినగాను
తడయక దేశింగుని పినతండ్రి ధరణిసింగుడపుడు
గడగడకాళ్ళును చేతులువణకగ కడుమోసమునేడూ
యెప్పుడులేని భేరీశబ్దము యిప్పుడునిచ్చటను
తప్పక గలిగిన విధమేమోయని తడబడుచునుదాను
నాటిగమోర్జాపై నెక్కియు దాజూచియంతలోను
పేటిగట్టున దిగినదండును యేర్పడగనుగొను
త్వరితంబుగ తనతనయునియొద్దికి తరలివచ్చువేళా
గురుపరముగ దేసింగుడురంగని గోరిపూజచాల
చేయుచుండె శ్రీహరినారాయణ శ్రీశపద్మనేత్ర
తోయజనాథ జనార్ధన కేశవ కాయజహరమిత్ర
భావజజనక పరమపురుషహరి పార్థమిత్రశౌరి

సేవితహా జనావనమురహర చేరినాథహరి
అనుచును తనపాలిటిరంగేశుని మనమలరగనతడు
ఘనముగ ప్రార్ధనజేయుజూచెడు పినతండ్రియునపుడు
తనయుడైన దేసింగునిజూచి తానుబల్కినాడూ
అనగాపుత్రిక వినుమొకవింత కనులదెరచిచూడు నేడు
గనుగొను ప్రళయంబుగనున్నది యీకరణిజూడ నేడు

తోండ్రమల్లొజి దండెత్తివచ్చిన సమాచారము
దేసింగునకు ధరణిసింగు దెలుపుట.

పనిమానియూ నీపూజలేమిటికి బాలుడదేసింగూ
మనము యేమరియుండినందునను తనయా దేసింగు
మనకోటకు నిపుడాపదవచ్చెను తనయా దేసింగూ
ఆసమయము శ్రీరంగునినర్పింపగ ఫలమా దేసింగూ
దేవనూరిలో భేరీశబ్దము ధింధిమియనుచూను
నావాదంబుగ నబావుకందు దడయకవచ్చేనూ
ముదుకొని నాలుగుదిక్కులదండు ముట్టడివేసేనూ
మనమిప్పుడు యేమరియుండుట యిదిమర్యాదాయనెను
బహుపూజలు చేయుచు వినినప్పుడు బాలుడు దేసింగూ
సహజంబుగ కనుదెరచిజూచెను చాలగదేసింగూ
రామురాము రే దేహామీకు రాంతండ్రిగారూ
రామురాము రే తండ్రీమీరు యేమిజెప్పినారూ
యిందుకునేను భయపడనయ్యా యిపుడుతండ్రిగారూ
సందేహము మీకేలనిప్పుడు చాలతండ్రిగారూ
అనుచును పకపకనవ్వపలికెను అంతటదేసింగూ
ఘనముగ సింహ గర్జనజేయుచు కనుగొనిదేసింగూ
మన్ననతోనా మనవివినవయ్యా పినతండ్రిగారూ
పన్నెండేండ్లపైకమిక్కడను పినతండ్రిగారూ
పన్నెండేండ్ల గుండుమందును పినతండ్రిగారూ
పన్నెండేండ్లుగ పెరిగినకనువు పినతండ్రిగారూ
పెంపుగరంగేశుని కృపగలగ బెదరనేలమీరూ
యింపుగరంగేశుని పూజించుచు యిపుడుతండ్రిగారూ

రామరామయను నంతకాలము రాజ్యమేలుదామా
ఈమహిరాజు లాగ్రిణిసూరత నిపుడు హెచ్చినాము
తగువున సబాబుదండుతీసుకొని తానువచ్చినాడా
తగువుబెట్టుకొని నన్నెదిరించెడి మొగవాడైనాడా
పోదగువాని పరాక్రమమిల్లను భూమిపాలుగాను
వంతుజేసెదను తక్షణమున మీరందరుజూడగను
పులినోటనుబడి బ్రతికినవారీ భువిలోనున్నారా
తెగలక మదమేనుగుతో బోరి తప్పిపోయినారా
పట్టుకపట్టి గట్టెదనిప్పుడు దిట్టముగనువాని
మట్టుమీరినను యిట్టట్టు గదలక కొట్టించెదకాని
కదలకనితని మొదిరించెదను ఖండితంబుగాను
ఇదిగో నాబలమెదిరిబలంబును యికజూడంతయును
కానినబాబు నెచటికినిప్పుడు కదలనీయనయ్యా
పోనియ్యను యీరాత్రికినిప్పుడు పొందుగపిన్నయ్యా
సారెకుయుద్ధము చేయుటకే సందేహంబును లేదూ
నూరులోచావు నారులోచావు తీరితేనువిడువదు
ఘడియనావకాసము చేయుదు కనిబల్కెడనంతయును
సరసంబుగ నైవేద్యములొసగియు హారతులిచ్చియును
పరమభక్తి నుపచారములన్నియు సరగజేసియును
పట్టుసరిగెబల్ జమానీమా బాగుగధరియించి
దిట్టముగా జల్తరుపేటంచు ధట్టిగట్టిలేచి
సరిగల్ పాగా బాగబుట్టాగా శిరమునందుబెట్టి
కరముల నవరత్నంబులు జెక్కిన కంకణములుబెట్టి
వెలలేని రవలంటిజోళ్ళను వేడ్కచెవులమెరయ
గెలువుమీరగా రత్నహారముల్ సరసగాంతిమెరయ
పచ్చలకల్కి తురాయిదాల్చెద నచ్చుగశోభిల్ల
ముచ్చటవేళకు నుంగరంబులు హెచ్చుగవెలసిల్ల
శృంగారించుక దేసింగుడుబల్ సింగమువలెనప్పుడు
ముంగళకరముగ బారికత్తిని మరియుదాల్చినాడూ

హార్కారులద్వారా దేసింగు తోండ్రమల్లుని బిలిపించుట.

తనకొలువులోనుండెడి హార్కార్లను తప్పక జూచియును
కనులెఱ్ఱగజేయుచుకోపంబున కదపల్కెననుటను
యేమోయ్ హార్కార్లారమీరు యిప్పుడువినరోరి
నామీదికి దండెత్తివచ్చిన యాతడెవ్వడోయీ
పోయిశీఘ్రముగ వానిసంగతులు పొసగదెలిసిబాగా
నాయెడకును దొడ్కొని తెండన్నను నంతవారువేగా
చనిధీరతతో తోండ్రమల్లుని చయ్యనవనటుజూచీ

హార్కారులు తోండ్రమల్లుని బిలుచుట.

ఘనుడగు దేసింగుడు మిమ్ముదెంజికి గ్రక్కునరాబనిచి
వచ్చినార యికతెండుతెండని వారుబల్కవేళా
అచ్చటనిలబడి గడగడవణకుచు నదురుచునటుచాల
నిలవకూడదిక చలోబాయియన నేర్పుతోడలేచి

తోండ్రిమల్లోజి దేసింగు మహారాజు కడకువచ్చుట.

పూనిబొంగిలియుమించి సున్నమున పొసగనామమేసి
యేనుగనెత్తురు నడినామముగా మానితముగవేసీ
భయముతో చెంజికిపోయెను తోండ్రిమల్లోజటువేగ
ప్రేమతోడరా రంగేశుని మనమున పెంపుదలచిబాగా
తొందరతో యేనుగుపై నెక్కెను తోండ్రిమల్లోజీ
వెడలెను దేసింగుని కొలువునకు విహితరీతిగానూ
తడయకవచ్చుట దేసింగునిగని తటుకున ప్రియమునను

దేసింగు తన కొలువున నుండువారల బిలిపించుట.

పొందుగగొందర హార్కారులను పురుషులురప్పించి
అందుమీదటను వారినిజూచి యరసిమీరుమించి
జయరాంగంగేరామునిని తెండికజల్దిగకొల్వుకును
రయముగపిల్వుడు గోపాల్ సింగును రత్నరాజు
రామసింగు లక్ష్మణసింగు రమ్మనుకొల్వుకును
ప్రేమమీరగా హీరాదాసును బిలిపించుచుండికను
ధరణిసింగును మానీసింగును కరుణసింగులాను

ధరలోలక్ష్మణ దాసుహనుమని తడవుసేయకానూ
పేటశిపాయి మహాత్మానుని పిన్నయ్యను వేగా
ఆటంకము జేయక తెప్పించుడి అరనిమిషములోగా
అన్నంతట హర్కారులుచేరియు వండరిబిల్వగనూ
విన్నంతట వారందరువచ్చిరి వేడ్కకొలువునకు
కొలువుకువచ్చిన జమేదార్లను కోటను బేదార్లు
చెలువంబగు దేసింగురాజునకు చెంతజేరివార్లు
రాంరాంరాంరాం రాంరాంరాంరాం రాజా దేసింగూ
మేమురాగల దెలువుకార్యము మేలగు దేసింగూ
సామజవరదుండు శ్రీరంగస్వామియు దేసింగూ
ప్రేమతోడ నీవలుకులనందరు పెంపుగ దేసింగూ
అనగావారల కొల్లను రాంరాం అనిమను దేసింగూ
తనమదిగనలుచు నట్టిచూచను తనరగ దేసింగూ
దుడుకున నేనుగనప్పుడు దిగిమను తోంద్రమల్లయ్య
గడగడవణకుచు రంగేశానను కలసిబోవవయ్యా
కమలనాభ శ్రీహరినారాయణ కంజనేత్రశౌరీ
అమరవందిత అనాథరక్షక అనుచుమదినికోరీ
ఉన్నవాడవు నన్నుబ్రోవుమో పన్నగేంద్రశయనా
కన్నతల్లి తండ్రియునీవే నాకెన్నగ నెప్పుడును

దేసింగు తోంద్రమల్లోజిపై కోపము జేయుట

పొంగుచు తోంద్రమల్లోజిని దేసింగురాజుజూచి
రంగుమీర మాకోటమీదికి రానేలమదించి
యున్నడు నీవీదారియెరుగవివు డేలవచ్చినావూ
నిన్నెవ్వడు బంపించినాడు మదినేరక నెవ్వడవు
నబాబు ఠండీటురా నేమిటికి నాదుకోటపైకి
జవాబుచెప్పుము నీకాజంపుదు జవాబుజెప్పకున్న
ఇదిగాకను రణభేరివేయగా నేమికారణంబు
పదరక దెల్పుము బ్రతుకవలసినను పరగనీనిజంబు
పరువెరుంగకను పలువతనంబున బవిషిమాలినీవూ
తలమెరుగకను కడుతలింపుగాని తప్పుజేసినావూ

అరనిమిషంబున సీతలదునుముకు నంచితంబుగాదూ
సరగుననిన్నిట బంపినవానికి బలమూ క్రుంగగాను
అని దేసింగుడు ఘనకోపంబుల కనులనిప్పులొలయ
కనుగొనియును నాతోంద్రమల్లుని గడసియుకతనలుక
గర్జనతో కత్తిజ్వలిపించిన గడగడవణుకుచును
మర్జిదెలిసియు రంగేశునితా మరిమరి పొగడగను
ఈకరణినినాపై కోపము నీవిట్లుసేయవలదు
సాకినవారలు చెప్పినపనులను జరుపగ నెట్లగును
రాంరాంనాడగు మనవి వినవయ్యా రాజా దేసింగు
నామీదను కోపము సేయకను ప్రేమదయనొసంగూ
కొంచము నామాటలు వినుమీ పెంచకనిప్పుడును
మించినబాబు నూటెనిమిది మేటిపాళెములును
కిస్తీరూకలు కొదవలేక ప్రశస్తనందరును
సుస్థిచేసి యీచెంజికోటలో జస్తునిల్వగాను
మెండుగ మాకీరూకలు యిరువది రెండేండ్లనికలవు
దండిగపాత చెంజికిపోయి తడయకిపుడునీవూ
జాకీతెమ్మని సాదుల్లానుకు పంపినాడునన్నూ
తేకువచెడి నీమరుగుజొచ్చితిని దేసింగునకునేనూ
సింగమువలె కనుబొమలు కదలగ చెదరగొట్టుచును
బంగరువారపై రత్నాల్ బరుడి రంగుగ మెరయుగను
తెగువమీరిన కత్తినిదూసిన దేసింగునిచూచి
తగమాని యాతోంద్రమల్లుడు తప్పకపుడు లేచి
శరణుశరణునను కాపాడుటకిది తరుణము మహారాజా
తొడరిచంపక కాపాడుదువా తోంద్రమల్లన్నా
అనుచును ధరణిసింగుని మరుగున కరుగనానుజూచి
గురువటంచు నీమరుగుజేరితిని ధరణిసింగురాజా
నిర్భయంబుగా మెదుటనుసీవు నిట్టులాడుచున్న
పినతండ్రి శరణంబు వేడెనని పెనుకోపమునణచి
దుర్బుద్ధిని యిటుబల్కగ దగునా తోంద్రమల్లన్నా
నిర్భయంబుగా మెదుటనుసీవు నిట్టులాడుచున్న
తొడరిచంపక కాపాడుదునా తోంద్రమల్లన్నా

తోడబడ మాపినతండ్రి మరుగున తోండ్రమల్లన్నా
చావక బ్రతికితివి సమయంబున చక్కగ వినుమన్నా

దేసింగు మహారాజు సాదుల్లాఖానునికి జాబువ్రాయుట.

నీవలె సాదుల్లాఖానుడు వచ్చిన నేడుచచ్చునన్నా
సావకాశమే వలదునజాబును చక్కరమ్మనన్నా
ధైర్యముగలిగిన మానవుడయితే తర్లిటురమ్మనుచు
శౌర్యముగలిగిన సిఫాయివైతే జల్దిగరమ్మనుము
కనిసిన చేపలనమ్మెడిలబ్బైకి కిస్తీకట్టవలెనా
మొనసుబేదార్లేకడకయినా ముల్లెలంపగనేనో
యీసారియు పోయినసారికైనా మొలమిపండినాదా
తీసుకపోవచ్చును యీకనువు వాసిగనున్నది
కోటకు వెలుపటి గుండురాళ్ళను గొంచుగబొమ్మనుము
యేటియివుకనున్నది వొంటెలపై యెత్తుకపొమ్మనుము
వరదవచ్చినప్పుడు యీ యేటిలో బురదనిలిచెనెండు
పరువున కవిదగ నెండిచెక్కలై యున్నవి గొనిపొండు
వరుసగమెడ్లను గోనెలమోపుల నొప్పుగగొనిపొండు
పెరికెలు యెండించుకపోవచ్చును గుమిగూడుకరండూ
అనిపలికియు కలకలమనినవ్వుచు అప్పుడు దేసింగూ
పనివడిజాబటువ్రాసియిచ్చెను పటుగతిదేసింగూ
దుడుకునవ్రాసిన జాబుతీసుకొని తోండ్రమల్లుడును
గడగడవణకుచు మూర్ఛజెంది యక్కడను శవము వలెను
పడిమూర్ఛిల్లియు తెప్పరిల్లుకొని బహుశాభీతిగను
విడిచియచట నేనప్పుడు నేగుదు పుడమీశునికడకు
కనలుచున్న దేసింగునిమోమును కనుగొనియంతటను
మనమలరగ శ్రీరంగేశాన్విత మాధవయిప్పుడును
రక్షించిన నేనోయెదగడలి రంగనాధస్వామి
లక్షకుత్తులకు నన్నము బెట్టెద రంగనాధస్వామి
రంగుమీర గోదానములిచ్చెద రంగనాధస్వామి
అంగముతో నార్యాడుజేర్చెము రంగనాధస్వామి
శృంగారంబగు వస్త్రములిచ్చెద రంగనాధస్వామి

మంగళకరమగు భూషణమిచ్చెద రంగనాధస్వామి
త్రాణిలుడిగ నిర్జీవమాయెను రంగనాధస్వామి
ప్రాణములను గాపాడుమిప్పుడు రంగనాధస్వామి
ఇటుధ్యానించెద తోంద్రమల్లుని నంతటగని పేర్మి
పటుగతి పకపకనవి దేసింగుడు పలికెనపుడుకూర్మి
మకరాంకుని జనకునిదలచగ వినుమణిచనవిపుడ నేను
యికనొకమాట నేనేచెప్పెదను యింపుమీరగాను
నీవువచ్చినటు వబాబువచ్చిన నేబోనివ్వనురా
కావునవానిక నేభయపడనురా కానీరమ్మనురా
నీనెత్తిన తిరుమణికి భయపడితి నిన్ను నేనుయిపుడు
మొత్తికాలు పట్టీడ్చి వేతురా నెత్తిపగులనేడు
శోకతో రంగస్వామినిదలచగ సాక్షినిలిచిరారా
లేకుంటే నీప్రాణముతీతును ప్రకటముగపోరా
అమ్మాటలువిని తోంద్రమల్లునికి నప్పుడణగెపొంగు
రాంరాంరాంరాంరాంరాంరాంరాం రాజా దేసింగు
రయమునన్నాపై కోపగించకుము రాజా దేసింగు
పోయెదనయ్యా కోటవిడిచి యింపొందగాను వేగ
భయమునుజెందియున్నానయ్యా బాలుడట దేసింగు
ఆ యెడనున్న జమేదార్ల తానంతజూచి బాగా
యేనుగపైని గుఱ్ఱముపైని యెక్కలేముసుమ్మీ
మానగనార్కాడుకుపోవుటకై పాలకిని తెమ్ము
వరుసగమూడుదినాలపైణమై వస్తిమి చెంజికిని
దురుసుగాను యీరాత్రికినార్కాడుకు వడిగనమేము
వొప్పదునామది త్రిప్పటబడియెడి దారలజొచ్చెమేము
ఇప్పుడెప్రాణము పెడనునటంగని యెన్నవలసెననగాని

తోంద్రమల్లుడు చెంజీనుండి యార్కాడునకుబోవుట.

పన్నుగ నాతండంతటవడిగా పరువిడదొడగగను
క్రన్నన సాయంకాలంబునకును కదలినసేనలును
వన్నెమీర నార్కాడుచేరెను వరుసగనంతటను
సన్నుతముగు నార్కాడుచేరగా జరచిరిభేరియును

ఆభేరిశబ్దము వినినంతట నబాబుసాదుల్లా
తా బంగారునాయని జూచియు తనమదివిలసిల్ల
పరువడి చెంజిరూకలు వచ్చునా బంగార్నాయుడా
పంపించుము చమురుజముఖానా బంగార్నాయుడా
పరగసరాబును బిల్వబంపుము బంగార్నాయుడా
పరికింపగ దీపాల్పెట్టింపుము బంగార్నాయుడా
అనగా బంగార్నాయుడు కడువడినట్టెయొనర్పగను
తనమిత్రులతో గూడక ప్రియమును తగువేషముతోను
చదువుతీరి కూర్చుండె నవాబు సాదుల్లాఖానుడు

## తోండ్రమల్లోజి నవాబునొద్దకు వచ్చుట.

కడసి తోండ్రమల్లోజి వచ్చియటు నెదురనిలచినాడు
తోడనె సలాముజేసి నబాబుకు తోండ్రమల్లన్న
వేడుక బదులు సలాముజేసెను వెలయు నబాబన్న
వులువలుదంచిన రోకలివలెనే యూరకనిలుచున్న
తలచినకార్యం బేమాయెను యిక తప్పక బలుకన్న
చెంజిరూకలు యేమిజేసితివి చెలువుమీరినిపుడు
పంజరైన దేసింగుడేమని పలికినాడు నేడు
చెప్పుము వేగమె తోండ్రమల్లన్న చెలువుమీరనేడు
తప్పకమీదటి కార్యము నేను తలచెడనికచూడూ
తప్పకమీదటి కార్యము నేను తలచెడనికచూడూ
రూకలులేవు కాసులులేదు రూఢిగానునచట
వేడుకతో దేసింగుని సరియా ధీరులులేరచట
నూటయెనిమిది పాళెగాండ్రను నేటుగజూచితిని
పోటరియగు దేసింగునిచే పంగపాటులుగంటిని
భళిభళి యేమనిచెప్పుదు చచ్చిబ్రతికివచ్చినాను
తులువయైన దేసింగునిచేతను తొందరపడినాను

## తోండ్రమల్లయ్య నబాబుకు జాబుయిచ్చుట.

జాబువ్రాసె నీపేరని దేమో నబాబుసాదులా
జాబువారిగా జూడగ దెలుసును నబాబుసాదుల్లా

దుడుకున నిట్లని జాబుయిచ్చెను తోండ్రమల్లో
బడేకర్ణము రంగపిళ్ళను తడయుకపిలిచెను ఖాజీ
వ్రాసియిచ్చిన జాబుచూడవోయి రంగనాథపిళ్ళా
వాసిగజాబును చదివిచెప్పుము వరుసవర్థమెల్ల
అనివినికడువడి రంగపిళ్ళతా నప్పుడుజాబుచూచి
కనులుచుతోడనే తలవంచుకొని తనదుమైనిమరచి
ఇటువలెనుండిన రంగపిళ్ళను యెలమితోడగాంచి
తటుకున దెల్పుము జాబుసంగతిని దాచవలదుమించి
రెండుగడియలకు లోపలచెంజిని పిండిగజేయింతూ
దండియైన దేసింగునిపట్టి తలతెగనరికింతూ
అంతఃపుర కాంతలనేబట్టి యాటచేర వేయింతూ
వంతంబుననా పోటరులనునే బ్రద్దలుగావింతూ
జాబుననుండే వర్తమానముల సవిస్తరంబుగానూ
జాబురెతెల్పుము రంగపిళ్ళయిక పటుతరంబుగానూ
అనిననబాబుతో రంగపిళ్ళ తానిప్పుడిట్టులనియెన్

రంగపిళ్ళ జాబుననుండు సంగతులు వివరించుట.

వినుమికజాబునగల వృత్తాంతము విశధంబుగననియెన్
నీవువచ్చినటు నబాబువచ్చిన నింకబ్రతుకకుడన్నా
సావకాశ మికవలదునబాబును చక్కరమ్మనన్నా
ధైర్యముగలిగిన మగవాడైతె తరలివేగరమ్మా
శౌర్యముగలిగిన సిఫాయియైతె జల్దిగనిటరమ్మా
మీసముగలిగిన రోషివైతే వాసిమీరమనము
దేసింగుని కత్తిమొనరూకలు తీసుకరాబొమ్మా
కినిచినచేపల నమ్మొడిలబ్బెకు కిస్తికట్టననెను
మొనసుబేర్లెక్కడనెనా ముల్లెలంపమనెనో
యీసారియు పోయినవారానికె నెలమినివుండినది
తీసుకపోవచ్చును యీకనువు వాసిగనున్నయది
కోటకువెలపట రాళ్ళగుండ్లను కొనివేగమెపొమ్మా
హేటియిసుకను వాంటెలపైన నెత్తించుకపొమ్మా
షెర్దికలు నిండించుకపోవచ్చును సరగునవచ్చినను

ధీరముగనున్నది యీపదార్థములు చింతలేకనను
రస్థితలేని యీడడిదైతే ఢిల్లికిపోబొమ్ము
వారకయీభావమునాజాబున వ్రాసినానురమ్ము
అచ్చుగనామాటలువినినాడా నబాబుసాదుల్లా
హెచ్చినకోపముతోడమండుచు నచ్చటవారెల్ల
వినగా బంగార్నాయునిజూచి కనుబొమలదరగను
కనులెఱ్ఱగను కావిగప్పగను కడువడినదరుచును
తనమదికోపము తారసిల్లగా తానవుడిట్లనెను
వినవోయి బంగార్నాయడ యిప్పుడు వేగిరంబుగాను
అనికినలయు పను లెల్లనిప్పుడా యుత్తముతోడుతను
పరగగుఱ్ఱముల రౌతులదెమ్మను బంగార్నాయడ
పరువడిఢంకా వేయుగబంపుము బంగార్నాయుడా
రంగుగజండా యెత్తుమిప్పుడే బంగార్నాయుడా
పొంగణంచెదను దేసింగునునే బంగార్నాయుడా
అనియిటుబల్కుచు నబాబప్పుడు అతివేగముతోనూ
ఘనముగకోపము కడువిస్తరమై కాఱుగ్రమ్మగాను
అంతటకత్తిని దూసిపట్టిగడ నబాబుసాదుల్లా
పంతముతో మీసంబడవేసెను భయపడప్రజలెల్ల
పటపటపటయని పండ్లుకొరికెను బరువడిజనులదర
చటులకోపమున కన్నులనిప్పులు చెటచెటమని చెదర
ఆసమయంబున బంగార్నాయుండతనిచెంతజేరి
వాసిమీరనే యేయేపాళెల్యారిబిలుతుమీరి
నూటయొనిమిది పాళేగార్లను నేటికొల్వానకునూ

### బంగార్నాయుడు పాళేగాళ్ళకు జాబువ్రాయుట.

వాటముగా బిల్పించువేగమే ధాటిమీరగానూ
అనవిని బంగార్నాయుడప్పుడా హర్కారెల్లరును
పనిచెనుబొమ్మని నూటయొనిమిది పాళెమ్ములకును
నిమిషములో హర్కారులుపోయట నెరిగించుటవేగా
క్రమమున జాగీర్దారులప్పుడు కదలిరాగబాగా
తప్పక మందుగుండుదంపు తయారుతోడుతను

తెప్పునవచ్చిరి యెల్లపాళెగార్లప్పుడు కొల్వుకును
సేతుపట్టుయేల్ గంగేరామటు చేరెనుకొల్వుకును
యాతిరువణ్ణామలను బంగిదార నప్పుడుకొల్వుకును
తిమిరికోటయేల్ షేకుమహమ్మదు నప్పుడు కొల్వుకును
నమరివాల్ కోటబ్దుల్ కాదర్ నడిచెను కొల్వుకును
ఆరణివెంకట్రావుం డప్పుడు వచ్చెనుకొల్వుకును
కారికరియాలూర్పెద్ద దొరయును వచ్చెకొల్వుకును
చెంగల్పట్టు సుబేదారుడు జేరెనుకొల్వుకును
మంగళపేట జమీన్దారుడు మరియు డిచ్చెనపుడు
అచ్చినాయుడు బొమ్మినాయుడువచ్చెరికొల్వుకును
హెచ్చుగ నగర్పాళెగాడును వచ్చెనుకొల్వుకును
మరియునుగల పాళెగాండ్రును మచ్చికమీరంగా
తరితెరింగితామప్పుడె యార్కాడ్పురగ జేరగాను
పెంపుగ ధణధణధణధణయనుచును భేరివేయగాను
సొంపుగ నబాబువిని నాశబ్దము నింపుమీరగాను
వచ్చినవారిని గనుగొనియప్పుడు వరుసగకొలువెల్ల
మచ్చికంబున లేవగముదము నవాబుసాదుల్లా
ముచ్చటమీరగ జంగర్నాయుని ముందుగరప్పించి

నవాబు జంగార్నాయుని సేనలనున్ను రస్తులనున్ను తయారుచేయుమనుట.

మెచ్చుగమందును గుండును మూడునెలలకు నిప్పించి
తడయకరస్తు జమీందార్లకును తయారుచేయించి
వడిగలయిార్నూర్ ఫిరంగీలను వరుసగనెత్తించి
యెనపై వేల బారుతుపాకుల యిప్పుడు తెప్పించి
ఘనముగనందుకు మందుగుండు గ్రిక్కననిప్పించి
నరగునయేనూర్ జమీందార్లకును సంగతిదెల్పించి
బరువడిరస్తు సుబేదార్లకును భర్తీచేయించి
ఠీవిగ పచ్చని తెల్లపన్నియ డేరాలెత్తించి
లావుగ నెనభై వేల సిఫాయిల నీసటురప్పించి
లెక్కాలులేని కాల్బలములనెల్లను చక్కగనిప్పించి
మక్కువ యిరువై వేల యేనుంగుల నిక్కడజేర్పించి

లక్షగుఱ్ఱముల పదివేల్ వొంటెల లక్షణంబుగాను
యీక్షణంబునను హాజర్ చేయుము యింక వేగమునకు
ఆమాటలువిని బంగార్నాయుడు అడ్డిసేయగాను
సీమామూలపు బలమునెల్లను జేర్చి శీఘ్రముగను

బంగార్నాయుడు దండును తయారుచేసితినని నబాబుకు చెప్పుట.

బంగార్నాయుడు సలాముజేసియు నబాబుకిట్టులనెను
సంగతులన్నియు సెలవుచొప్పనను జాగ్రతయినదనెను
ఇంతమాటలు సాదుల్ ఖానుండింపుమీరవినితా
అంతలోన జల్దిజల్దియంచు నగరుజొచ్చి
జామాసీమా దొడగినాడయా సాదుల్ ఖానుండు
సాముగపట్టు ధట్టిగట్టుచు సాదుల్ ఖానుండు
జరీబుటేదార్పాగా జుట్టెను సాదుల్ ఖానుండు
జరీబనారను పచ్చడమందెను సాదుల్ ఖానుండు
సరవిగకల్కితురాయిదాల్చెను సాదుల్ ఖానుండు
సొంపుగపట్టా కత్తిబట్టెను సాదుల్ ఖానుండు
అప్పుడు పట్టపుయేనుగ తెమ్మనె నబాబుసాదుల్లా
తెప్పున తెచ్చెను మావటివాడును తేజముల్లసిల్ల
శృంగారంబగు యేనుగనంతట జూచిసంభ్రమమునను
బంగారంబరిపై యెక్కెను రంగుగ చెలంగగను

నబాబు సకలసేనాసమేతంబుగా చెంజికి యుద్ధమునకు బోవుట.

పాళేగాండ్లను కూడిచెంజికిని పయణంబావేళా
చాలగ భేరీ వేయించుటకై సాటిరిపులదూల
భీకరంబుగను ఢణఢణమని భేరీమ్రోయగను
ప్రకటంబుగను ధగధగ మెరసెను పట్టాకత్తులును
కణకణకణకణమనుచు తంబుర గ్రక్కునమ్రోగగను
పనివడిదపబిపమని గుఱ్ఱములు బారుతీరగాను
సరగునజల్లిరి తాచాతిమ్మట సన్యవాద్యములును
మురుసుగ బూరుగ కాహాళములును తోడనె చల్లగను
అరుసుగ నబాబుదండు నిలిచె పదియామడదూరమున
గరిమతో నబాబు యేనుగనెక్కి గ్రక్కునరాగాను

ముందుకటికముల్వరాకనుచును మొనసిపొగడినిండి
అందును వింజామరులు కుంచెలు సందిప్పిచుచుండ
పట్టుగొడుగులు సరిగెలు పడిగెలు దిట్టముగా రాగా
చుట్టును బేగార్లందరు యెంతో మట్టుమీరిబాగా
రాజితముగ నూగింజవేసినను రాలదుదండునను
భూజనులందరు జేజేయనుచును పొగడగనదువగను
పెంపుగతిమిరి కోటదగ్గిరను భేరీవేయించి
తెంపునవచ్చి డేరావేసి దిగినదండునుజూచి
నయముతో బంగార్నాయునిజూచి నబాబుసామల్లా
ప్రియముతో దండుకురస్తుకట్టుము పేర్మివార్మికెల్ల
అనిన నప్పుడె బంగార్నాయుం డందరికిని వేగా
పనిబూనియు నడిపించెనురస్తు బాహాటముగా గా
అంతటకదువడి బయలుదేర దండారణిమార్గముగా
కొంతదూరమున కేగియు డేరాకొట్టిరియటు వేగా
ఆర్కాటిరి.యచ్చటనుండెను దండంతట మరునాడూ
భేరీవేయుచు దేవనూరిదిరి జేరివిడచినాడూ

నబాబు బంగార్నాయునికి దేవనూరి యేటిగట్టున
దండును నిలువవలసిన క్రమముదెల్పుట.

యేటిగట్టునను డేరావేసి అంతదండుదించి
సాటిగసాధుల్ ఖానప్పుడు బంగార్నాయునిజూచి
పరగ దండునకు సంబారంబులు బంగార్నాయుడా
మరిదురస్తు జేయించుమిప్పుడు బంగార్నాయుడా
పటాళముల నచటనిలువుము బంగార్నాయుడా
జటాణిరౌతుల నొకచోట నిలువుము బంగార్నాయుడా
రంగుగ గుఱ్ఱాల్డేరాచుట్టునుబంగార్నాయుడా
సంగతియు దెలిసియు నిబ్బరభద్రముగ బంగార్నాయుడా
పారచౌకీలేరు పరుచుమిక బంగార్నాయుడా
బారీజండా నెత్తించుము మరి బంగార్నాయుడా
నూటిగబారు తుపాకికత్తులు మేటిరౌతులను
వాటముగా నందందు నిలువుము తేటమీరగాను

హెచ్చిన బీరంగులమొార్జా లెత్తించుమయిపుడు
బంగార్నాయు పటుజాగ్రతతో పాళెపట్టులెల్ల
మెచ్చివచ్చునట్లెల్ల బలంబుల మెరయజేయుమనుడు
రంగుగవాకచో మొనలుధీరియు రయముగశోభిల్ల
ముచ్చటతోడను మొనగాండ్రందరు ముందరగానిపుడు
అచ్చటకడుజాగ్రతతోనీారు హెచ్చరికలు గనుడు
అనుచును బంగార్నాయుడు మనలను అరసినేర్పునను
కనుగొనుపదరకు కడువెడపొదవగ కావించేనుత్వరను
ఇటులనబాబు పాళెంబులను యేరుపరచియంత
తటుకున భేరీ వేయించెను ధంధణమునినాదెంత

ధరణిసింగు దేసింగునకు దండువచ్చియున్న సంగతి దెలుపుట.

భేరీశబ్దము పాతచెంజికి సారెకువినగాను
కారుబారుగని ధరణీసింగును గడగడవణకుచును
వింతలిదేమా కలిగెనటంచును వేగమెబరుగెత్తు
అంత నబాబు దండునుజూచి చింతచేతజొక్కి
తడబడుచును దేసింగునివద్దికి కడువడిబడిరాగా
కడువేడుక దేసింగుడు రంగని యడుగు పూజకునేగా
ధరణిసింగుడు రంగనాధుని తనరునాలయమునకు
వడవడినేగి తదేకనిష్ఠుడై భక్తియొనర్చుకకు
బాయక నారాయణ శ్రీహరి కేశవ పద్మపత్రనయన
తోయజనాథ జనార్ధనచ్యుత దుష్టసర్వాపహారణ
మాధవదైత్య వధాగళశూత్ర శుభ దితశస్త్రకరా
శ్రీధరనీధర శార్ఙ్గ ధనుర్ధర సేవకసౌఖ్యకరా
అనిరంగేశుని పూజయొనర్చును వినుతులునేయుటకు
మనమున నుతించుచు దేసింగును ఘనతనుమెచ్చుటకు
వొప్పగనిట్లని ధరణిసింగుడు యివ్విధుసుకుమారా
దెప్పర మొదవెను దేవపూజలు తీర్పగసరియేనా
ఈపూజలచే ఫలమేమివ్వుడు యెన్నడు యెన్నగనుకుమారా
చేరేనబాబు దండును దేవనూరిపేటవద్ద
ఊరకెన్నుకలు మాసుకపూజలు సలుపువారుగద్ద

చాలుచాలు బాగాయెను పూజలు చాలుదు దేసింగు
ఏలయింక యీ దేవునిపూజలు చాలుదు దేసింగు
బిట్టుపిడుగు బడ్డట్టుదండితో చుట్టైర దేసింగు
కట్టిపెట్టు మీ దేవరపూజలు ఘనమతి దేసింగు
తలక్రింద గుండాయెన బాబు తన యా దేసింగు
ఎలమితోడమన యేమరియుండుట వలవదు దేసింగు
అని యిటుబల్కిన తన పినతండ్రివచనము తావినెను
కలునువిచ్చి యాధరణిసింగును గనుగొని యిట్లనెను
పెంపుదూలిభీతిల్లగ నేటికిపిన్నయ మీకిపుడు
ఇంపుగ దేవర పూజకువిఘ్నం బీవుసేయకిపుడు
ఈయెడనొకక్షణ మిచ్చటవూట సేయవలయు నేను
పాయకదండును భేదించెను పదర పొమ్మనెను
పిరికితురకలనుజూచి మీరకలిటు బెదర జెందవలెను
సరికెదనిపుడా తురకలనందర నాకుజెప్పవలెను
సంగతిదెలియక యిటులబెదరుటలు సాహసమ్ముగాదు
దొంగలగుంపును జూచిబెదరునా కొదమసింగమరుదు
చింతనొందగా దగదిప్పుడు మీ రెంతయు ధైర్యమును
సంతోషంబును జెందుడియనగ సంతసమలరగను
సంగతిదెలిసి యూరకుండెను సరగధరణిసింగు
మంగళకరమగునని పూజించె శ్రీరంగని దేసింగు

## సుభంగిదొర నబాబుతో దండుకు దేవమారిపేటలు కోళ్ళయివ్వమనుట.

నబాబుదండుతో తిరుణామలయేల్ సుభంగిదొరగారు
నబాబుతో యిట్లనిపలికెను సుభంగిదొరగారు
ఇచ్చటదండుకు కోళ్ళ దేవనూరిప్పించగవలెను
ఎచ్చుగ సేనకుసంతోషంబున నేడువరచవలెను
అనిన సాదుల్ ఖానుం డుత్తరమప్పుడివ్వగాను
మిన్నుబెదరగా భేరీవేయుచు మేటివీరులాను
సొంపుగ సుభంగి దొరనటుగూడి తెంపుతోడలేచి
గుంపుదుగూడి దేవనూరిలో కోళ్ళ పెట్టదలచి

కొంతసొమ్ములు కొంతవస్త్రములు కొల్ల పెట్టిరవుడు
కొంతరొక్కముల్ కొంతనవరత్నముల్ కొల్ల బెట్టిరవుడు
కొంతధనమును కొంతధాన్యమును కొల్ల బెట్టిరవుడు
కొంతపశువులు కొంతపేయలును కొల్ల బెట్టిరవుడు
చొరబడి స్త్రీలను చెరలుబెట్టె సుభంగిదొరయపుడు
నరగునపురిలో కాపులందరును పరువులెత్తిరంత
బరువడిగా దేసింగుని గనుగొని మొరబెట్టిరికొంత

కాపులు దేసింగుమహారాజునిగాంచి మొరబెట్టుట.

రాంరాంరాంరాంరాంరాంరాం రాజా దేసింగు
రాంరాంమనవిని వినగదవయ్యా రాజా దేసింగు
దేవావిభుమిదో నబాబుదండు దేవనూరిలోన
యావత్తును దగకొల్లబెట్టిరి అరయకునికిదగున
కొండధనరాసులు రత్నముల్ కొల్లబెట్టినారు
శంకలేక భూషణ వస్త్రాదుల సంగ్రహించినారు
పట్టిరిస్త్రీలను పురుషులనెల్లర పెట్టిరి చెరలోన
ఇట్టటుకడల కొందరిపట్టుక వేవేగరాగాను
ఏమనిజెప్పుదుమయ్యా మేము యిప్పుడు దేసింగు
నేమముపూజలు సల్పనుసమయం బిపుడా దేసింగు
కన్నులమూసుక పూజలుసేయను కాలము కాదయ్యా
ఎన్నగపూజలు రాజ్యముకలిగితె మెన్నోకలవయ్యా
ఇంతబ్రతుకు బ్రతికినపుడవమానం చింతపడితివయ్యా
ఇంతవచ్చుటలు తెలియకపోయెను యేమిసేతుమయ్యా
అన్నను కన్నులు దెరచికాపులను మన్ననతోజూచి

దేసింగుమహారాజు కాపుల నాదరించుట.

తిన్నగబల్కెను వారలతోడను దేసింగుదుమించి
కాపూలారామీరలు యీ చెంజిలో కదలకుండుడోలి
ఏవుమీర శ్రీరంగనికిపూజ నేనిపుడు జేసికదలి
వచ్చియుండెడి నబాబుదండును నొచ్చటపోసియను
విచ్చేవిడిగే వారలంద్రుంచెద హెచ్చు శౌర్యమునను
ఒక్క దేవ నూరొళ్లబెట్టినా రిక్కడనుతకలును

చక్కగ నబాబురాజ్యము కొళ్ళ సరగునమీకౌను
ఇప్పించ మీరేల భయపడెదరు నిపుడు కాపులార
ఒప్పించెద మీ సొమ్ములు నేఁ వుడు కాపులార

దేసింగుమహారాజునొద్దకు ధనసింగు వచ్చుట.

అనియిటుకాపుల సమ్మతిపరచి యంతపూజచేయ
ఘనుడగు దేసింగుని దాయాదగు ధనసింగుడుడాయ
వచ్చిచూచి దేసింగుతోడను వదలక నిట్లనియెఁ
హెచ్చుగపూజలు యేమిటికయ్యా యింకనన్నవినియెఁ
కొళ్ళబెట్టియా దేవనూరిలో కొళ్ళగాక యిపుడు
మళ్ళివచ్చి మనకోటకెక్క నబాబుదండునేడు
శ్రీరంగనాయకుని దేవళంబులో రంతులు జేయుచునుండు
పొంగుచుతురకలు కోటముట్టడి మొనగవేసెదండు
కన్నులుమూసుక యూరకయుండుట ఘనులకుఁదగవగును
వన్నెగాను నీవిప్పుడు కదనముపన్ని వారసేన
బలువడంగను బారినమదియు బలుకీర్తినిగనుము
జడునిపోలికను యిట్టుండుటలు కడుదీనతవినుము
అనియిటు ధనసింగుడు దాబల్కగ మనమునఁగోపించి
ఘనుడగు దేసింగుడు రంగేశుని కడువడిపూజించి
కన్నులుదెరచటు ధనసింగునితో కనలుచు నిట్లనెను
ఇన్నిచేసి నబాబుసంధును యికవిడువను నేను
పొందుగ తురకలు గుళ్ళొజొచ్చిన పూజలింకనేల
అందునబాబును నరికిపూజసే విందుసేతుచాల
అనుచువిచిత్రపు కాలకువచ్చెను అప్పుడు దేసింగు
పనివడికాలికి షరాయిదొడిగెను బాలుడు దేసింగు
నిలువంగీలు దొడగినాడయా నేర్పన దేసింగు
జలతారుపట్టు పట్టిగట్టెను జల్దిగ దేసింగు
నరిగెబుటే దాస్పాగాజుట్టెను చక్కగ దేసింగు
పరువడిబులుసా కాలువగప్పెను కాలుడు దేసింగు
కల్కితురాయిని కట్టెను కెత్తిన గ్రుక్కన దేసింగు
చిల్కతాలిహారమ్ములు వేసెను శీఘ్రము దేసింగు

బదివేల్తులముల యెత్తుకత్తి చేపట్టేను దేసింగు
ఇదిగా కేడ్యేల్తులముల ఖారాయెత్తును దేసింగు
మూడుమణుంగుల భేష్కబ్జాను ముదమున దేసింగు
గాఢంబుగ దట్టిలోన జెక్కెను కడువడి దేసింగు
సింగమువలె కూర్చుండెనప్పుడు సిపాయి దేసింగు
పొంగుచు యుద్ధముగలైనేడని చెలగుచు దేసింగు
సంగతి హర్కార్లను తాజూచి చయ్యననిట్లనెను
రంగుమీర సర్దార్ల నెల్లను రమ్మను కొల్వుకును
పినతండ్రైన ధరణీసింగును బిరబిర కొల్వుకును
పనివడి రత్నసింగునుయూట గోపాల సింగుతోను
రాముసింగును లక్ష్మణసింగును రయమున కొల్వుకును
రాముదారి నీలక్ష్మణదారిని రమ్మను కొల్వుకును
మానిసింగును గిరిపుసింగును మరిమరి కొల్వుకును
సేనజేర్చుకొని రమ్మనుడిప్పుడు శీఘ్రముమీరగను
అనగాహర్కార్లా మెయినందర నప్పుడు బిల్వగను
పనిబూనియు వారందరు సేనలు మునుకొని వచ్చియును
రాంరాంజయసీతారాంరాం రాజా దేసింగు
రాంరాంయనగను బదులుగరామనె రాజా దేసింగు
జమేదారులను కన్నులజూచెను జల్దిగ దేసింగు
మనవి వినవయా యని దేసింగుడు పినతండ్రినిజూచి
వినయముతోడుత నిట్లనెనప్పుడ వేడుక చేసాచి
ఎనభై వేల గుఱ్ఱాలున్నది యిచట నబాబుకును
అనయము లక్షసిపాయిలుగలరు కనగ నబాబుకును
మున్నూరు గుఱ్ఱములున్నది మనకు పినతండ్రి యికను
మన్ననగలుగు సిపాయీలే నూర్మందిగలరు యికను
చాలుచాలు యీనబాబు గెల్వరు చాలుతండ్రిగారు
ఏలయింక నీ సేనతో గెల్చెద చాలుతండ్రిగారు
మలకనూరిలో వున్నాడయ్యా మహమ్మత్ఖానుండు
పిలిపింపుము నిమిషములోపలను పిన్నయ్యా నేడు
మరిజల్దిగ పంపుము మూడామడ మలకనూరియిటకు
త్వరలో బంపుమటన్నను జూచి ధరణిసింగుడలను

### దేసింగురాజు తన యిష్టసఖుండగు మహామత్ఖానుని బిలిపించుట.

అంతట హర్కారులచేతను జాబపుడు బంపగాను
గంతుతో మలకాపూరిలో మహామత్ఖానుని జూడగను
మంగళకరమగు పందిటిలోపల మహామత్ఖానుండు
శృంగారంబుగ పెండ్లిపీటపై సొగసుగనున్నాడు
నాగస్వరములు మృదంగములును సంతర్శుల్లరులును
బాగుగ భేరినవబత్తులును పరగ ప్రమోయగాను
చేతను కంకణమప్పుడుకట్టుక చెలువమీరగాను
చేతుల మంగళసూత్రము లెత్తి చెలగికట్టగాను
అల్లారే యల్లారేయనుచును నవుడు కట్టువేళ
ముల్లాశాస్త్రపద్ధతిగాను మొనసికట్టువేళ
ఆవేళలో వార కారులప్పుడు సతనిజూచిచాల
ప్రేమమలరగ హితుడగు దేసింగుడును బిలువబంపినాడు
యేమిప్రాసినాడో మీ జాబును నింపుతోడజూడు
జల్దిజల్దీ మహామత్ఖానుడ జలిలేచిరమ్ము
జల్దిగరమ్మని దేసింగునికి జల్దిగానులెమ్ము
అప్పుడు మహామత్ఖానుడు జాబును విప్పిచూచినాడు
తెప్పక మంగళసూత్రము తట్టలో తానుబెట్టినాడు
ప్రాకటంబుగను మహామత్ఖానుడు పకపక నవ్వుచును
వేకువమీరగ చెంజికిపోవలె తెప్పన నీమొదను
నాకతిమిత్రుడు దేసింగు తానలమట జెందుటకు
ఈ కంకణము పెండ్లికిగాదు యెన్నకదనమునకు
యుద్ధమందున శత్రులగెలిచి యూరటనొందియును
శుద్ధంబాకీర్తిని నేపొందియు సూటిగ పెండ్లిని
చేసికొందునని మహామత్ఖానుడు చెలగిమోహరించి

### మహామత్ఖానుడు చెంజికి పోవుటకు బంధుజనులకు సెలవొసంగుట.

వాసిగ తనబంధువుల నెల్లను వడిగ నవుడుజూచి
తగినకొలంది సలాములుచేసి తడయక సందరిని
తగవుమీరగా తనమాటలు విని తనివిపుట్టియునికి

తెలిసినవార్లకు మహమ్మత్ఖానుడు ధీరతతోడుతను
బళిరేమీరలు సంతోషముతో బంపవలయునన్ను
అన్నలారవో తమ్ములారమీ రరసిపెద్దలార
పన్నుగ మీరిచ్చటనుండుడో పఠాణిదొరలార
నేనొక మనవిని చేసెదవినుమిది నిమ్మళంబుగాను
పూని నబాబుతో యుద్ధము జేయగ పోయిటువచ్చెదను
పగవాడైన నబాబుచెంజికిని బలములతోరాగా
తగదికనిక్కడ నుండుటనాకు ధర్మముచెడిపోవు
ఎదిరియైన నబాబుదండులో నిపుడు నేనుజొచ్చి
తుద మొదలిదియని తోచగనీయక దునిమెదనెదమెచ్చి
అచ్చాబహాదర్ మెచ్చితినిన్ను తుచ్ఛసైన్యములను
కచ్చపరూపుడు కడలిగలంచిన కరణినియిప్పుడును
కలచెద వారాయనమీరగను కడువడిశూరతను
ఇలగలవారలు నెల్లరుమెచ్చగ నెటులసేయగాను
మహిలో నెవ్వరుచాలరంచు మీరందరుననగాను
విహితంబుగ నేబోయివచ్చెద నావేడ్కలుప్పతిలను
అనియిటు మహాత్ఖానుడు వెడలగ నావృత్తాంతమును
వానితల్లివిని వడిగావచ్చెను వలవదుడుగుమనెను

## మహమ్మత్ఖానుని తల్లిపోవలదని ప్రలాపించుట.

ఎదురుగవచ్చి కుమారునిముద్దిడి యేరాసుకుమారా
ఇదియుద్ధమునకు సరియగునే యీప్రొద్దునిల్పగదరా
పదిమాసంబులు మోపికనినను బాలుడవిడువకురా
అదిమొదలుగ నిన్నెంచినదాన నన్నుడగకవిడువకురా
బుద్ధిమంతుడని నామదిలోను పొంగుచుంటిగదరా
యుద్ధముసేయగ బొమ్మననా మనమొప్పదు సుకుమారా
గంధముబూసుక యుద్ధముజేసిన కత్తినరుకుతగులు
నుందర, కంకణమునతో జోరిన నూటిగుండు తగులు
పసుపువస్త్రముల ననికి ననిపినను పరగగుండు తగులు
పసివాడవు నీకేల నబాబుతో పరమవిరోధములు
పెద్దలమాటలువిని నీవిప్పుడు పెండ్లికొరతదీర్చ

సిద్ధంబుగ నీబంధువులతోడను జేరివిందానర్చి
బహుమతులును బహుమతులగు బందులబలుమన్నన జేసి
సహజంబుగ వారల రమయాళ్ళకు సరగననుపజెసి
ఈదినమిచ్చట నుండియు నీవును యుదవుగా రేపు
క్రోధముతోడ నబాబుదండును కూల్చిరావుమావు

**మహామత్ఖానుడు తల్లిని సమాధానము చేసుట.**

ఆమాటలువిని మహామత్ఖానుడు నేను తల్లితోను
ఏమమ్మా నీవిటు వల్కెదవు యివుడు చెంజిలోను
నన్నేలిన దేసింగు వ్రాసెను నాకుజాబునేడు
నిన్ననబాబటు దండునుగూడుక నెదిరించినాడు
యీవేళకు నాచెంజిదుర్గము యేమాయెనోకాని
సావకాశము జేయకూడదిక చయ్యన నేపూని
రెండు గడియలకులోన నబాబు దండునరికివేసి
ఖండితముగ నార్కాటుకోటను కాల్చిపాడుచేసి
చెంజిరాజుకు పట్టముగట్టెద శీఘ్రముగా నేను
రంజితముగ సాదుల్ఖాన్కాతురిని రయముగ నేలెదను
లేకఉండున గుండుతగిలి నీల్గినను నిందువడవికద్దు
మెండుగ ముందరి పోటునబడితె దండి పడవికద్దు
పౌరుగ భువితో పుట్టినయపుడే చావునిశ్చయమ్మ
పోరి జయించిన శాశ్వతకీర్తిని పొసగగందునమ్మ
కినిసి దండులో పోరితెగినను కీర్తిగలుగునమ్మ
వెనుకడుగులు బెట్టుదురే శూరులు వింతలుగాదమ్మ
అని యీ విధమున తల్లికి సమ్మతి గనబడ బల్కెను
చనియెదనిప్పుడు చెంజికి జననీ చాలధీవెనలును
ఒసగుమటంచును మహామత్ఖానుం డొప్పుగ నప్పుడును

**మహామత్ఖానుడు నీలవేణియను గుఱ్ఱము నెక్కి చెంజికిపోవుట.**

పసగలసొమ్ములు పట్టువస్త్రంబులు పకావడి దొడుగుచును
మరిమరితల్లికి సలాముచేసి మహామత్ఖానుండు
త్వరలో గుఱ్ఱపు లాయంబునకు తాను వచ్చినాడు

మున్నూర్గుఱ్ఱంబుల లోపలను ముఖ్యంబౌదవగను
వన్నెకెక్కువగు నీలవేణియను నా గుఱ్ఱమునటను
గట్టిగకట్టినగాడి పీచాడిని ఖడ్గంబునవరికి
దిట్టముగను పురజనులకు గనుగొని దీవెనలిమ్మనిపలికి
జల్దియనుచు నీలవేణికిని జాగ్రత తెల్పుచును
జల్దిగ నబాబుదండులో జొరబడి జయమునొందవలెను.
పొందుగ జన మని నీలవేణికి పోషాపిచ్చియును
ముందుగ నడువుము నీలవేణియని సందేహించుచును
అల్లారేయల్లారే యనుచును ఆటధపుడాయించెన్
ఎల్లవారు జూడగను చెంజికి నల్లననే తెంచెన్

## మహామ్మత్ఖానుడు వచ్చుచుండగా నబాబు సేననుబంపి నడ్డగించుట.

ఆ సమయంబు నబాబుసేనలు నతనిజూచి వేగ
మోసముయెవడో వొంటిగుఱ్ఱమును వేసుకవచ్చెను బాగా
శూరుండితడని తోచుచున్నయది |జూడగానుయిపుడు
నాలస్యము గాదిక నిట్లుండు సరగున రండని యపుడు
కొండలమందుచు వారల మున్నూర్గుఱ్ఱములను దెచ్చి
సందులేక నడ్డముగా వచ్చిన చయ్యనగోపించి
గిరగిర మనుచును నీలవేణితో కినిసి తిరిగితిరిగి
పరువడి మారిమొసంగినరీతిని బల్మిపట్టి పెనగి
చురుకు చూపులను సేనలజూచి యొరను కత్తిబెరికి
కరుకుకరుక్కని హయములనెల్లను గజిబిజిగానరికి
నన్నుగదురుగగ గుఱ్ఱములెల్లను భయము నొందెనటను
వున్నసిఫాయీల్ కన్నులబడకను కన్నపాటి యటన్

## మహామ్మత్ఖానుడు దేశింగుమహారాజును గాంచుట.

మహామ్మత్ఖానును చెంజిలో రాజామహాలు కేగిలోన
సహజంబుగ దేశింగునిజూని సలాంసలామని
బదులు సలాము చేసెనప్పుడు బాలుడు దేశింగు
అదివిని మహామ్మత్ఖానుడు మదిలో సంతట నుప్పొంగి
కొనుచు నబాబు సంగతి నిన్నటిదినము తెలిపితేను

మొనల నభాసుజేసి దంచు మొత్తివిడుతు నేను
ఇత్తరియుత్తరవైతే నరకెద తుత్తుమురులుగాను
నత్తాలేని కార్యంబిది యెంతటిది త్తరిచూడగను
అని యిటుపల్కిన మహమ్మత్ఖానుని మనసెరింగి తెగువ
తనరగ పెండ్లిపీటవిడిచి మొనదాక వచ్చుటకువగవ
ఆమాటలు యింకేమియిప్పుడు అన్నా దేసింగు
నామాటలు వినునబాబునిప్పుడు నణతువానిపొంగు
దండువాల్లకల్లోలంబుగను తా జేయుటగాక
పెండుచునార్కాడిల్లను పాడుచేసిన యటువెనుక
పెలగి నబాబుకోమార్తెను పెండ్లి జేసుకొనెదచూడు
పెలువుతోమీరు పెండ్లికిరావలె సిద్ధముగా నపుడు
అని దేసింగుడు మహమ్మత్ఖానుతో నప్పుడెట్లులనెను
చనిమనమిద్దరు నబాబునిప్పుడు చంపగవలెనికను
సావకాశమును చేయకూడదిక సంగతిజెప్పెదను
దేవుడయిన రంగేశును త్తరవు దీసుకరావలెను

దేసింగు తనతండ్రితో తనభార్యను జూడవలెనని అడుగుట.

నగరుకేగి నారాణినిజూచి తగవుబలికి నేను
పగవాడయిన నబాబునుమనము పరగగెలుతుమికను
నగరికిబోవుచు పిన్నతండ్రితో ననియెనుయిట్లనుచు
పగనబాబుతో గలిగెనుగావున తగవులు నేగనుచు
బోవలెయుద్ధంబున కటుగావున పొందుగనాకిపుడు
ఈవలెను త్తరమిప్పుడు తడయక యీవలయును నేడు
పోయిరాణిని పొడగని నేను పోయెద దండుకును
ఈయెడ నాలస్యముచేయుగ రాదెన్నగమనమునను
ఆమాటలువిని ధరణిసింగుండపుడు వ్యసనమునను
యేమిరానాయన నీవిటుబల్కిన నేమిసేతు నేను
తనయానీవు శుక్రవారమున తగజనియించినది
ఘనముగరాణియు శుక్రవారమున తనరగబుట్టినది
నీదుగుఱ్ఱమును శుక్రవారమున నేర్పుగవచ్చినది
యీదండునునా శుక్రవారమున నెలమివచ్చినది

వరుసగ నీకును రాణికి హాయముకు వచ్చినసేనకును
పరికింపగను జన్మవారములు వొకటిగనుండుటను
పరవిని శుక్రునివారంబెన్నగ సామిగవినునేడు
సరిగాదరుగుట కదనంబునకును చక్కగానుజూడు
నేడంతయునోర్చుక రేపరుగుము నేర్పుమీరగాను
ఘోటానెక్కి కుజనులుబెదరగ కొడుకానీవలను
సమ్మతినొందక దేసింగుడుబల్ సాహసంబుతోను
ముమ్మరమగు శూరత్వముతోడను మొనలగలపగాను
తలచినపనికిని తరిమెరుంగక తారుమారుగాను
పలికెను ధరణిసింగుడటంచును కలతనొందగాను

ధరణిసింగు దేసింగునితో భార్యను చూడకూడదనుట.

తెలిసియప్పుడా ధరణిసింగుడు దేసింగునిగాంచి
పలుకరించెద నొక రహస్యము బాగుగనూహించి
అదివినుమేమన నొకటియున్నది జెప్పెదనుతనయా
సదయులయిన పెద్దలశాస్త్రంబులు చక్కగ వినుమయ్యా
ధరణిపుబ్బ యాశ్లేషము మొదలగు దురితపురిక్కలను
విరిబోణులు తాఋతుమతులయిన కోరవేసనియందరును
చెప్పుచుందురు గావుననీకతి చేటుగల్గుదినము
దెప్పరమగు నీధరణితారను తెలియగానువినుము
మొదటిపాదమున మొదటిరజస్వల ముచ్చటగానయ్యెక్
అదికారణ మీవికనార్నెలలు నతిజూడరాదనియెక్
నామాటలువిని కొరతదినంబుల నయముగానుగడను
మదిదోచినకార్యము రేపు నెరవుము మదిపెరవకను
పుట్టుచున్నది నాదుకుమారక పొసగవినుముమాట
పట్టపురాణి చూడతలంపును మానుము యిచ్చోట
అనినామాటనువిని దేసింగుడు నతికోపముతోను
తనపినతండ్రినిజూచి యిట్లనెను నయముగ నంతటను
కామాతురుడను నేనువర్జితుడు ఘనదురవస్థలను
పోషనూహ్య నున్నతకాలమును చొక్కనరకమునను
నీమాటలనిటు లుండగనిమ్ము నిజముగాను తండ్రి

నేమముదప్పను కదనంబునకును నేనుబోదుతండ్రి
ముందుబెట్టిన యడుగును నేను మొనసివెనుకనిడను
యిందుకు యోచన వేరేలేదు సందేహించకను
నాకొసంగుము సెలవువేగమే న్యాయముగాతండ్రి
ఈ కార్యముకై యివు డభ్యంతర మొనయనీకతండ్రి
ఈరీతిగ పలికిన యాతనయుని మేవుమీరగాంచి
తీరుగ నీకును రాణికి నడుమను తెరమరికట్టించి

దేసింగు డంతఃపురమున కరుగుట.

మాటలాడవచ్చురతనయా యన మదిసంతసమునను
తేటగ రాణి నగరుకువచ్చును దేసింగుడంతటను
వచ్చినకార్యము హార్కారులతో వదలక చెప్పినను
అచ్చట యంతఃపుర వాసులతో నమరగ దెల్పగాను
దాదులుపోయి రాణితో బల్కిరి తడయక నప్పుడును
ఓ దేవి నీప్రాణనాథుడిదో వాస్తాగవచ్చెనుకనము
రమ్మనుమని సెలవిచ్చెను వేగమె లెమ్ము రాణియనుచు
సమ్మతించి సంతసమునలేచి కమ్మని జలమునను
స్నానముచేసి చలువలుకూలము చక్కగసవరించి
మానుగపట్టుసిలిబిరవికెయు మమతతో ధరియించి
పన్నీర త్తరుగూర్చి కలపము బాగుగానునది
కన్నులకాటుక ముఖమున తిలకము తిన్నగానుదిద్ది
కరకంకణములు కాళ్ళ గజ్జెలను కంఠసరంబులును
బొగడలు కమ్మలు జుమికీల్ బేసరి బులాకునత్తులును
నిగనిగ మెరిసెడి యొడ్డాణంబును సొగసుమెట్టెలును
మొదలగు నాభరణంబన్నియు మురిమువిూదదొడిగి
పడపడిసొంపులు కులికెడు సొగసున పరిథవిల్లి కడిగి
పొసగమల్లెలు మొల్లెలు కొప్పున పొందుగాను ముడిచి
ముసిముసినగవుల తోడసఖ్యులగు మదితలతో వచ్చి
తెరచాటున ఘుల్ ఘుల్లని నిలిచిన దేసింగుండటను
పరసతిగూర్చి వాసిగనిట్లనే పరమహృథంబుగను
మరువకవినునా ప్రాణనాయకి పౌరుషవిషయమును

సరసతలేక నబాబు సేనలను చయ్యనగూర్చియును
దండుచెంజిపై దెచ్చియిపుడు దలపడియుండగను
ఖండితంబుగ నబాబుతోడను కయ్యము జేయగను
తెంపువలెవలె నిన్ను జూచుటకు సొంపుతోడనేను
యింపుగవచ్చితి నికక్షణమేనియు నిల్వగూడదిటను
అన దేసింగునితోడ రాణితానప్పుడు గ్రక్కునను
ఘనమగు వ్యసనముతోడ బల్కెను తనమదిబగులగను

రాణి దేసింగుని యుద్ధమునకు బోవద్దని సంవాదముచేయుట.

నబాబుతోడను యుద్ధమువలదు నాదుప్రాణనాథ
నబాబు సరిలేదని కోపించకుస్వామి మనవి వినునాథ
కలుగునటంచును తెలిసిచెప్పితిని యులసటనొందకుడు
వెలయముదంబున నేనుచెప్పితిని విస్తరంబుగాను
ఆదరింపకావలె నాపలుకులు భేదముదలపగను
ఆదిదేణడౌ రంగనిధ్యానం బరసిచేయుమికను
కోటకు వెలుపట యుద్ధముచేయగ పాటముగాదిపుడు
సాటిగాదు తురకలతో యుద్ధముస్వామీ మన మిపుడు
జయకాలము మనకిప్పుడు లేనిది ప్రియనాథా వినుము
నయముమీరగా సంధిక్రియలను ప్రియముగ గావింపు
అటువలెజెప్పిన రాణినిగనుగొని యిట్లనియెనునపుడు
పటుతరమగు దండెల్లకోటయిట పనివడిరానిపుడు
కృపనతనూరక నేనుండిన నకార్యుడనరెయిలను
అపకీర్తియు లోకాపవాదములు నరయగనాకగును
అని దేసింగునితోడ రాణి తా నప్పుడు డిట్టులనెను
మనమునగుందుచు పరితాపంబున తపాతపానొందుచును
స్వామీమీరు నన్నగ్నిసాక్షిగా చయ్యనచేపట్ట
ప్రేమసుఖముల ననుభవించకను పెలుకువతలపెట్టె
తెగువకు జోరగాతగవగునా మీ మగటిమిజూపగను
తగుతరుణంబిది గాదనిదోచెను నాదగుమనమందు
ఇటుజెప్పిన గనిరాణితోడ దేశింగుండిట్లనెనూ
పటుతరముగ నే దండునజోరబడి పరులజయించినను

తేటుకునవచ్చి నిన్నే లెదనే తప్పకయివుడును
నటులధైర్యమున శత్రులద్రుంచెద నత్యంతంబుగ నేను
రాచదండులో నీల్గినస్వర్గము ప్రాకటముగగలదు
చేగొనిజయమును చెందివచ్చినను చిరకీర్తియుగలుగు
అని దేసింగునితోడ రాణితానప్పు డిట్టులనెను
ఘన విక్రమమున దండునజొచ్చి గ్రక్కునమీరలును
ముందు నరకునను పుడమిని బడినను ముఖ్యంబున నేను
సందేహము లేకను జేసెదవిను సహజమనముగను
వెన్నుపోటుచే ధరగూలినమిము కన్నులతోగనను
పన్నుగాను నే కట్టిడ్పింతును పాతిచెంజిలోను
అనిచెప్పిన యా రాణితో దేశింగపుడు యిటులనెను
ఘనతరముగు నీ వాక్యమునాకును కడుముద మొదవగను
ప్రీతియొనర్చెను సొంపుగనైను పిరితివియిక నేను
ఖ్యాతిగయుద్ధముజేసి బిరుదులతో కడువడివచ్చెదను
నాదుపరాక్రమమునకు దగినది నీదగుధైర్యమును
నీదు పలుకులకు సంతసించితిని నేనికపోయెదను
అనగా రాణియు నతిహర్షముతో నపుడు చెలులబిలిచి
ఘనతరవస్తుయుతంబుగ వీడెము మనములరగ తెప్పించి
అరసి శత్రులజయింపగ తాంబూలంబు నిచ్చినపుడు
తీరుగనాతనిచేయి శృంగారము తెరగుచూచినపుడు
పాటవమున సేనలనెల్లను తాబడలుపరచునందు
మేటివిలాసముతోడ శత్రువుల మృతువునొందించు
అనిసాముద్రిక శాస్త్రముదెలిపిన ఘనమతిగావునను
తనమది నిశ్చయమాదరించెను తరుణీమణితాను
నాథుని శృంగారము జూచుటకును నాకుప్రాప్తిలేదు
నాధునిగూటమి లేదని బ్రహ్మనాకువ్రాసెముందు
కన్నుల నీరునించుచు తనప్రియకాంతుని చెయ్యటను
కన్నులనొత్తుచు నేడ్వగచేయి తా గ్రక్కున వెనుకకును
తీసుకొనియును తెప్పునాతడు తెలివినివిలసిల్లుచును
వాసిగగుఱ్ఱము నెక్కుటకప్పుడు పరువడితోజనుచు
పదపడి గుఱ్ఱపులాయంబునకును పటుగతివరిగియును

## దేశింగుమహారాజు చోపుదారిని గుఱ్ఱమును శృంగారించి తెమ్మనుట

అదలించియు చోపుదారిని బారాహజారిని దెమ్మనెను
అప్పుడుబారహజారినటకు చోపుదారి తేగ
తప్పకశృగారించుక తెమ్మని యప్పుడుసెలవిచ్చి
రంగుగకళ్ళెము బంగార్ జీనియు రంజితంబుగాను
శృంగారంబగుపురి కావులను బల్సొంపుతో మెరయగను
చిల్కతురాయి శిరమునందును చెలువుమీరబట్టి
తళ్కులబంగారు బిళ్ళలదండలు దనరమెడనుగట్టి
పట్టుకుడిత్తి నీమచ్ఛడంబుబల్ పైకప్పునుగప్పి
దిట్టము బారాహజారి చోబ్దార్ దెచ్చెమనవిజెప్పి
నంతట దేసింగు తనబారాహజారినటుజూచి
సంతోషంబున సుబేదార్లను పరగజూచిలేచి
బారహజారి దగ్గర జేరి పైనచెయ్యివేసి
ఏరాబారహజారి నేను యీనబాబునుగెలిచి
వచ్చినరత్నాల్ భూషణముల నీకిచ్చెద వేడుకను
హెచ్చుధైర్యమున దండులో నీవు జొచ్చితిరుగవలెను

## బారాహజారి వ్యసనము జెందుట.

అన్నను బారాహజారి కంతట నతివ్యసనముదోచ
కన్నులనీరటు కారుచుండ తన కాలు దిగువరాచి
ధైర్యమువిడిచియు శోకనెత్తుకొని తలనేలకువంచి
శౌర్యముదూలి నోటనురుగుగా చప్పట్లనువైచి
ఉన్నగుఱ్ఱమును దేసింగుడుగని కనులెఱ్ఱగజేసి
నప్పుడు నిట్టులనుండవు బారహజారినినుడాసి
కాపాడితి నను మోసముచేయుట గలదెసమయమందు
సాపుగమేతకు పదివేల్ వరహాల్ చనిఖర్చులందు
పెంపుగపులవలు వలదని సెనగలు పెట్టిస్తినెనీకు
తెంపుతో లేత కసువుమోపులను తెప్పిస్తినెనీకు
నీళ్ళకుబదులుగ సారాయిదెచ్చియు నీకనుపోయిస్తి
వాళ్ళకిమెత్తగ దూదిమెత్తలు వొనరగ పరిపిస్తి

కల్లెము మొదలుగ నవరత్నములతో ఘనపోషణ కెపుడు
చెల్లుముగా చేయి సినెనీకు చెలగి మోసమిపుడు
యేల జేసెదవు తెలివిలేకనిక నే జెప్పెదవినుము
చాలగ భువి యీజన్మమె త్రిభువి మేలుకీర్తిగనుము
అరులోచావు నూరులోచావు అదినిశ్చయముగను
ధీరతయుద్ధములోన జచ్చినను చేరుదుపరమునను
పుట్టినప్పుడే చావునిశ్చయము పుడమినందరికిని
గట్టిగయిది నీమనసున నిల్పుము కడుధైర్యముపూని
అనవిని బారా హజారియంతట నతిధైర్యముతోను
ఘనమగు దేహము ఝుళిపించంతట గర్జనజేయుచును
ఉన్నగుఱ్ఱమును దేసింగుడు తానొప్పుగానుమెచ్చి
సన్నుతుడగు నారంగనాయకుని సన్నిధియటజొచ్చి
తిరుమంజన సామానుపుష్పముల దివ్యవస్త్రములును

దేసింగురాజు రంనాథునియొద్దకుంబోయి యుద్ధము
సేయుటకు సెలవునడుగుట.

వరమణియుత భూషణములు గంధము వాసనద్రవ్యములు
పరిపరివిధముల నైవేద్యంబులు బహుదీపాదులను
రంగనాథునిసన్నిధిజేర్చి రంజితంబుగాను
బంగరుపువ్వుల పూజించియును భక్తియుక్తును
రంగనాయకుల యెదుటనిలబడి పొంగుమనముతోను
రంగుమీరగ దేసింగుడు శ్రీరంగనిధ్యానించి
శృంగారంబుగపూజలు జేయుచు చెలగిని వేదించి
వాసిగ నాదేవునికినిమ్రొక్కియు పరమభక్తితోను
ఈ సమయంబున గాపాడగదే శ్రీశప్రేమతోను
నారాయణ శ్రీరంగ కేశవా ఘోరకలుషహరణా
వారిజాక్ష వైకుంటనివాసా శూరదనుజగమనా
తల్లివినీవే తండ్రివినీవే దాతభ్రాతనీవే
ఎల్లలోకముల కాధారంబగు యాదికర్తనీవే
కాచినబ్రోచిన నా చెలికాడవె బ్రోచుదైవమపుడు
ఓ చక్రధరా నీవేయనినే నుల్లములోపలను

నమ్మిక నున్నాడను యీ తరినే నెమ్మదిలోనెంచి
క్రమ్మికవచ్చు నబాబుదండును కడివడిఛేదించి
జయమునొసంగుము జలచరరూపక జలజపత్రనయనా
జయజయశ్రీహరిశత్రుహరి భుజగరాజశయనా
అనివేయివిధముల బొగడియుతగమది నవుడు శ్రుతముగాను
ఘనమగు భక్తిని మరిమరిమ్రొక్కుచు వినయము తోడుతను
బారాహజారిపయి నెక్కియును బలిమిని దేశింగు
తారతమ్యముగా జననెంచియును మరువకవలదనెను
వూని నబాబుతో యుద్ధముసేయగ పోవుచున్నాను
మానకిజయమును జలుగజేయుము మరువగవలదనెను
దేసింగురాజు రంగనాదునియెడల దుశ్శకునములుగను
తటకునధారుణి గిరగిరదిరిగెను తారుమారుగాను
బటువగు దేవునిమెడతో హారం బట తెగిభువిపడెను
పటపటమని గోపురశిఖరంబులు పడెనుభూమియందు
నటులతరంబుగ రాలెనుచుక్కలు తటుకునపగలందు
చుట్టుచీకటులు క్రమ్మినప్పుడు జూచువారికెల్ల
అట్టియఖండములారెను దేవునికణగతేజమెల్ల
గ్రక్కునస్వామియు ముఖమునుపడమటి దిక్కుద్రిప్పెనటను
అక్కడ దేసింగుడు రోషంబున అనెను స్వామితోను
యేమిరంగా నీవిప్పుడునన్నిటుల సేయదగునా
స్వామియనుచు నినునమ్మినందుకిటు జేయనీకుదగునా
గొప్ప దేవళము ప్రాకారంబులు నిప్పుడు కట్టిస్తి
తప్పక బంగరు ధ్వజస్తంబము నిప్పుడు జేయిస్తి
కల్కితురాయి కంఠస్వరంబున కనకవైరములును
చిల్కతాళియు హారంబులు మంజీరకంకణములు
నిత్యపడితరము దీపారాధన నిత్యోత్సవములును
ప్రత్యేకంబగు పంచపర్వముల బ్రహ్మోత్సవములును
అరయగ నీకొక తక్కువలేకను నడిపించితినేను
ఇరువుగనాకు నదుత్తరమిప్పుడు నియ్యకనుండినను
ఇచ్చినపోయెద ఇంకమీదనీవేమి చేసినానూ
హెచ్చును ధైర్యము దొలగదునాకు నెన్నికమీరగను

అనియటునిలవక చనియెడు రాజుతో నంతరంగుడనెను
వినునా తలుకులు దేసింగుడనీ విపుడు ప్రియంబుననూ
నిరతర బలముల గెలువగజనుము కడువడి దేసింగూ
వెనుకదీయకను వైరులగెలుపుము వేగము దేసింగూ
ఘనమునసీకునుకొదవయువలదు బాలుడ దేసింగూ
పనిబూనియునొక ముహూర్తమాత్రమే బాలుడ దేసింగూ
నీ పాలన నేనుండగదండున నేర్పుక దేసింగూ
సాపుగనరికియు సంహారింపుడు చయ్యన దేసింగూ

దేసింగురాజు యుద్ధమునకు జనుట.

అనగా సంతసమున రాజంతా హజారినెక్కికొని
తన సహాయులౌ సుబేదారులను తానట బిల్వమని
చెప్పిన రాంసింగు లక్ష్మణసింగుల తెప్పుననప్పుడును
తప్పకహీరాదాసు లక్ష్మణదాసుల నంతటను
ధరణిసింగును మానిసింగును కరుణసింగులాను
నరహరిసింగు నారణసింగు మురారిసింగులాను
రత్నసింగు గోపాలసింగును రాజాసింలాను
అతిత్వరజెట్టి సిఫాయ్ మహామత్ ఖానులనప్పుడును
రమ్మని చెప్పిన దూతలుజని వారందరు విడుదులకు
సమ్మతమునజని తెలియజెప్పగను చాలుయుద్ధమునకు
తమతమగుఱ్ఱము లెక్కికత్తులు దాల్చివారలంతా
అమితబలంబుల చేర్చుకనప్పుడు అటనిల్చిరియంత
సేనలగనుగొని సంతసమున దేసింగుడు పొంగుచును
దానటు భేరీవేయించెను ధంధణధణమనగానూ
కరుకున దేసింగుడువచ్చుటను యెరుకచేయుకొరకు
సారెకునప్పుడు బంగార్నాయుడు జేరిన బాబునకవుడు
సలామయ్యవో సలాముసీకు సాహుబ్లానూడా
బలేశూరుడై దేసింగుడు బహుబలములతో గూడా

బంగార్నాయుడు దేసింగువచ్చు విధంబున బాబుకు దెలువుట.

సింగమువలెనే దేసింగును చెలగివచ్చెనిదిగో
అంగములదరగ పులిరొప్పున దేసింగుడేవచ్చెను యిదిగో

మదమేనుగువలె దేసింగుడును మరివచ్చెను నేడూ
కదసికృష్ణసర్పమువలె నిప్పుడు కదలివచ్చెజూడూ
ఇదో దేసింగుని దండువచ్చెను యేమిచేయగలమూ
చెదరియున్నదె మనదండెల్లను యిదిమనమునగనుము
ఇప్పుడు యోచనచేయగ నాకును యేమితోచలేదూ
చెప్పెదనొక్క యుపాయమున్నది తప్ప వేరు లేదు
మట్టిచెట్టు మునిగున్నది నీళ్ళను మలయనూరిచెరువు
మిట్టగ తాయనూరి చెరువులో మేటినీళ్ళుగలవు
చెరువులు రెండును కొట్టి శంకరాభరణ మేటిలోనూ
బరువడినదిని దాటగూడదు మనుజులందులోనూ

నబాబు బంగార్నాయునికి చెరువులు తెగగొట్ట
వుత్తరవు యొసంగుట.

అనిచెప్పిన బంగార్నాయుని యావనంబుజూచి
ఘనమగుచెరువులు తెగగొట్టమని కడువడి శెలవిచ్చి
అంతట బంగార్నాయుడు వేగమె నన్నూటికిజనులు
కొంతచేర్చుకొని రెండుచెరువులను కొట్టినీళ్ళెల్ల
నిండుసంకరా భరణమేటిలో మెండుగ పొర్లుచును
చెండుచు బుసలుగొట్టుచు వచ్చెడి సర్పంబులవలెను
పడిగాకొండల పొల్లుంచుకొని వచ్చుచున్నవేళా
తడయక బంగార్నాయుడు దండును దనరజూచిచాల
వ్యూహముచేసి దండునెల్లను వొప్పుచేయవలెనూ
మోహారమున కనములు యేర్పచి ముందునిల్పుమనెనూ
అనుచు నబాబుతో బంగార్నాయుం డవుడుజెప్పగాను

బంగార్నాయుడు బందోబస్తుగా వ్యూహముగట్టుట.

మొదటికనములు సుభంగిదొరను ముఖ్యంబుగనుంచి
గతియించబ్దుల్ ఖాదర రెండవ కనములోననుంచి
ఘనముగ చావుత్ ఖానుని మూడోకనమను నిల్పియును
మలరగఖాన్ సాయబునాల్గో కనమయందునిడెను
అరయగ గండికోట సుబేదార్ నయిదోకనమకును
గురుతుగ నారవకనమకు నొకకోట సుబేదారును

మొన్నగనారణి వెంకటాద్రివును యేడవకనమకును
పన్నిమొనిమిదవ కనమచెంగల్పట్టు సుబేదారును
దురుసుగ తిమిరి షేకుమహమ్మదు తొమ్మిదొకనమకును
అరయగ పదియవ కనమకుసాదుల్ ఖానునిల్పియునూ
ఈరీతిగి బంగార్నాయుడు యేర్పాడటుగావించి
సారెకు తానునువ్యూహముచుట్టును సవారిచేసివచ్చి

దేసింగురాజు తనసేనలను దిట్టపరచుట.

ఉన్నవచ్చుటను దేసింగుడు తానున్నసుబేదార్ల
కనుల గనుగొని యిట్లనిపలికెను కదరివారికెల్ల
అలుబిడ్డల బంధువులమీదను ఆశగలిగియున్న
చాలగ ధనధాన్యంబులపై నాశలుమీకిపుడున్న
పెండ్లిండ్లకు ధైర్యశౌర్యములు పొసగలేనివారు
రండు ప్రాణములమీద దృష్టి లేకుండువారుమీరు
యుద్ధములో దిగిపడ్డవారికి గొప్పపదవికద్దు
ఇద్దరిలోపల గెలిచినకీర్తులు నెక్కువగాగలదు
అని దేసింగుడు పల్కుచు బారా హజారినిదలంచ
మొనసిసుబేదార్ల తా గుఱ్ఱముల ముందుగనడిపించ
వచ్చిసంకరాభరణముగట్టు వరుసగానునిలచి
యచ్చటవచ్చెడి పినతండ్రిని తానంతతిరిగిచూచి

పినతండ్రిని దేసింగురాజు వెల్లువయచ్చటనుండివచ్చెననుట.

ఇంతకుముందుగ [illegible]లేవు యీయేటియందుముందు
గంతులువేయుచువచ్చు ప్రవాహముగంటెనిపుడుయిందు
అనిపల్కిన దేసింగునితోడను పినతండ్రియునని యో
ఘనముగబంగార్నాయుని సేనల తనయాయిటులయ్యో
తాయమలయానూర్ చెరువులురెండును తెగగొట్టిరప్పుడును
పాయకసంకరాభరణమేటిలో పరగవిడిచినాడూ
తెప్పునరెండు గడియలలోపల తీసిపోన వినుము
తప్పకనప్పుడు యీగట్టునకును దాటవచ్చు మనము
అనవిని దేసింగుడు పకపకనగియయ్యవినుము నేడూ
మనకునుభయపడి చెరువులుద్రెంచిన మరినిలుతునచూడు

పన్నెండంకులు గలిగినట్టియా శారబాజారియును
యున్నతమైన గుఱ్ఱముతోనే నొప్పుగదుముకుచును
అనియప్పుడు యాబారాబాజారిని తనరగొట్టుచును
ఘనధైర్యంబున దేసింగుడుతా కడువడిదుముకగను
రామసింగుడు లక్షణసింగుడు రత్నసింగుడును
రామధారియును లక్ష్మణధారియు నంతగుఱ్ఱములను
మానిసింగును పేలుపిపాయి మహమత్ఖానుడును
పూనిగుఱ్ఱములతోడనప్పుడు పొందుగదుముకగను

సేనలు యేటిలోదిగి ముప్పది గుఱ్ఱములతో
యావలియొడ్డుకు చేరుట.

గుబగుబగుబగుబగుబగుబయుంచును గుఱ్ఱంబులుదుముక
తడతడనీదుచు నీరునునోట తీసియుమియుచును బాచా
రెండుఘడియల దూరమున్న యానిడుయేటిలోనూ
కొండలుదొల్లినయట్లాల గొన్నిగుఱ్ఱంబులనందు
పోయెపోయెనని యేటిలోనబడి పోయిరికొందరును
ఆయెడయేటిలో దిగకనుకొందరు పోయిరియూళ్ళకును
చిక్కినముప్పది గుఱ్ఱములప్పుడు యెక్కిరియావడను
తక్కినవారలు యెందరుపోయిరో లెక్కలేదువినుము
సలాముచేయుచు నిలబడియుండగ సరదార్లందరును
బలేవాహ్షుక్ మహమత్ఖానుడుబల్కెరాజుతోను
మనవివినుముమహారాజా నేనొకమాటచెప్పెదనెడ
చనిన కాబుతో మొదటియుద్ధమునకు సైంయముని నేజనెడ

దేసింగును మహమత్ఖానుడు యుద్ధముచేయుటకు
వుత్తరవిమ్మని యడుగుట.

పోవుటకు నొకఘడియ వుత్తరవు పొసగనియ్యవలెను
దేవరవారలు సెలవొసంగుటకు శావకాసమేమి
క్రమముగకనములు గొట్టిదండులో గ్రక్కునజొచ్చి
నిమిషమాత్రములోన నబాబును నేనునరికివచ్చి
మనవిజేసెదను వుత్తరమొసగుము మన్ననతోడుతను
అనియడిగినవా మహమత్ఖానుని యపుడుజూచియనెను

మహామత్ఖానుని దేసింగుడొంటిగా యుద్ధమునకు పోవద్దని జెప్పుట.

పకపకనవ్వుచు మహామత్ఖానుని బహుళక్తికిమెచ్చి
యొకడేకొడుకవు తల్లికినీవు వొప్పదుయిటువచ్చి
పనువువస్త్రములు కంకణంబుచే పరగదాల్చియిట
పసివాడవు వొంటిగయుద్ధంబును పొసగజేయకను
నేనునీవును గూడియిప్పుడు నెరయదండులోనూ
పూనియుద్ధము నబాబుతోడను పొసగజేయుదగునూ
అనవిని మహామత్ఖానుండప్పుడు అనియెరాజుతోనూ
మనమిద్దరమును గూడినబాబును మడియించిననిలనూ
నీకబ్బును చరకీర్తివిశేషము నెచ్చుగదేసింగూ
అనివిననవ్వుచు దేసింగుండా మహామత్ఖానునితో
చనిముందుగ నీవిప్పుడుయుద్ధము సలుపుమనగనెంతో
శౌర్యంబుననా నీలవేణిని చయ్యనదాటించి
ధైర్యంబుననా నబాబుదండును తానుజూచిమించి

మహామత్ఖానుడు ముందు సుభంగిదొర నెదిరించి యుద్ధముజేయుట.

పటపటయని దౌడా యించెను పరగనీలవేణి
చటులపరాక్రమమున తానొప్పెను చయ్యన నటుపూని
వ్యూహముజేసుక నుండుదండును తానొప్పగానుజూచి
మోహరంబున సుభంగిదొరను ముందుగనటుగాంచి
చాలగచిమటా యిచ్చెనపుడు నీలవేణికిని
ఇచ్చినబిరబిర నీలవేణియు జొచ్చెదండులోన
జొచ్చినజూచి సుభంగిదొర తానచ్చటవేగమునా
మూడువేల గుఱ్ఱంబులదెచ్చి మోహరంబుజేసి
తోడనెదానొక యేనుగ నెక్కక తోడబడనటడాసి
నిలచిన మహామత్ఖానుం డప్పుడు నీలవేణికిని
చెలువంబుగ బొమ్మని సెలవిచ్చిన చయ్యననటపూని
చొరబడి గుఱ్ఱంబుల రౌతులును తరిమితరిమియటను
కరుకుకరుక్కని పొరకాయలను నరికినతీరునను
గిరగిరమనుచును కత్తిద్రిప్పుచును కినిసిదండునెల్ల
నరగున నరికిన ముండెంబుధర నరుదుగబడిదొర్ల

ముందునడుకునకు మున్నూరుగుఱ్ఱము లండంబుగ దెగియుగా
కొండలమండగ వెనుక విసరుకుకొన్ని గుఱ్ఱములుపడియొగా
యేనుంగుల గుఱ్ఱంబుల భటులను హెచ్చుగ రౌతులును
మానగ మహమ్మత్ఖానుండుడప్పుడు మడియజేసియుటకు
తొడబడ ఫేట సిఫాయి సుభంగిదొర నప్పుడు జూచెగా
తడయక నీలవేణికి సైగలు వడిగ దిరుగుమనియెగా
వచ్చెడి మహమ్మత్ఖానుని యెదురుగ వైరులు బెదరగను
హెచ్చుగ నిరు మూడ్వేల గుఱ్ఱముల నచ్చటనిలుపగను
నీలవేణిని దౌడాయించి వేలసంఖ్యలయినా
చాలగకత్తితో తుండ్లుతుండ్లుగ కూలనేసిపైన
డికొనివచ్చెడు డండుకెల్లను తెగువతొనరకగను
మోహరించుకొని పడితనంతడను మొదటికమలోను
ఉన్నసుభంగి దొరనుకనుగొని కన్నులెఱ్ఱజేసి
ఎన్నగ గుఱ్ఱముతోడను వాని యేనుగపై గడసీ
మహమ్మత్ఖానును సుభంగిదొరను మరినరికెదననగా

మహమ్మత్ఖానుని సుభంగిదొర చంపవద్దని వేడుకొనుట.

తహతహ పడుచును కాళ్లుబట్టుకొని డనర వేడగా
అన్నామహమత్ ఖానుడనీవు నన్నువిడువవన్నా
మన్ననజేయుము నీ తమ్ముడను నన్నుగావుమన్నా
తెలియక యుద్ధంబునకును వచ్చితిని చలమువలదన్నా
కొలిచెదనిప్పుడు దైవంబని కొట్టవలదన్నా
తల్లియునీవే తండ్రియునీవే దాతభ్రాతనీవే
ఇట్లు నిలుపునే పిల్లవాడను యిచటదిక్కునీవే
అనినసుభంది దొరనొకచెయ్యి నంతటబట్టుకొని
ఘనముగ పలికెను మహమ్మత్ఖానుడు కడునుగ్రతపూని
పోటరివలె యుద్ధంబునకొచ్చి పొంకముచే యిపుడు
మాటలాడితె విడుతునెనిన్ను మడియింపగనేడూ
ఇంతపిరికిరంటయితే నీవును యింటనుండవలెనూ
కొంతసేనగొని యుద్ధంబునకును చెనగొని వచ్చినను
విడుతనంచు యేనుగపైనుంచి వేగదిగువద్రోసి

కడువడికత్తితో కుడిభుజంబును కరకున తెగవేసి
చంపబూనిన మహామత్ ఖానుని చయ్యన నటుజూచి
చంపవద్దని యెడమచేతితో సలామనుచువగచి
గోడుగోడని సుభంగిదార పడియేడ్వగ తానపుడు
వీడు కోసయని మహామత్ ఖానుడు విడువనంతవాడు
పరువడిపదలి దొకచెయితో వాడు పరుగెత్తెనునంత
తిరిగటు నీలవేణికిచిమటా మరియిచ్చెనుకొంత
బిరబిరదండులో జొరబడికత్తిని గిరగిర త్రిప్పుచును
తరుముచునరుకును నురుకుచు జనముల తడబడజేయుచును
పదివేల్ గుఱ్ఱంబుల నొకసారిగా పట్టియువోడించి
గదియించియు నాసేనలనెల్లను ఖండితముగద్రుంచి
పక్కలుపిక్కలు చెక్కలుముక్కలు ప్రక్కలుగావింతు
అక్కడ వీరుల చక్కగబట్టియు డొక్కలు వెసజించి
డండిగుఱ్ఱముల మొండెంబులుగా ఖండంబులుజేసీ
చెండుచునేనుగు తొండంబులను తుండ్లుతుండ్లుజేసి
మెడలు తొడలును కాళ్లుచేతులు కడువడి నరుకుచును
వడిగలశూరుల కడువడిబట్టి మడియగ జేయుచును
వెయ్యేనుగులతో షేకుమహామ్మదు వెలయుచుండగాను
యయ్యెడకును యామహామత్ ఖాను డటుబోవగదలచి
చాలగ మహామత్ ఖానుడు చిమటానీలవేణికిని
మేలుగ యెడమకాలికిచ్చెను నీలవేణికిని
ఇచ్చిన నీలవేణియప్పుడు అచ్చట నిలువగనూ
మహామత్ ఖానుడు షేకుమహామ్మదుతో రెండవ యుద్ధము జేయుట
పశ్చిమదిక్కున షేకుమహామ్మదు పరగదండులోను
వడిగాదూరుచు మహామత్ ఖానుడు వదలకయేనుగుల
కడువడికండలు ప్రేవులు కుప్పలుగా చేయుచుచాలా
యేనుగుగుంపులు కొండలువలెబడ నిలపొర్లగజేసి
పీనుగ పెంటలుగానుగ మహామత్ ఖానుడు తెగగోసెన్
ఇటులనుండగా షేకుమహామ్మదు జేనూరేనుగుల
పటుతరంబుగా ముందుబంపుగని పటుకోపములీల
వచ్చునేనుగుల మహామత్ ఖానుడు తెగగోసె

హెచ్చిశౌర్యము తోడనప్పుడు నచటకత్తితోను
ఎగబడి నరుకుచు తెగపడిపోవుచు యేనుగులన్నియును
ధగధగమెరసెడి కత్తివిఝుళుపుచు తెగువతో విసరగను
విరిగినకాళ్లు తరిగినమెడలును వొరిగిన మొండెములు
వెరగుబడియు నేతెరగుగానక తరినిలచినభటులు
బిరబిరబారగ నరుకేలబడియును ధరగూలిరివారు
పరువులిడుచు నా మహమత్ ఖానుని తిరిగిచూచినారు
యుద్ధముచేయుటకు రాలేదని యొదిగిచూచినారు
బుద్ధిలేక వచ్చితినయ్యాయని పొగలునట్టివారు
నిక్కంబుగ మము జంపగవలదని మ్రొక్కివేడువారు
యెక్కడబోదుము యేదిదిక్కనుచని యిటులవగచువారు
యీరీతినినుండగ దండెల్లను తారుమారుచేసి
వారికినీల వేణికిదమటా వడిగానపుడిచ్చి
కదలించి హాకుమును షేకుమహమ్మదు కడకుబోవనిచ్చి
యదలించి నా నీలవేణియును నంతచౌకళించి
యేనుగ తలమీదనుకాళ్లను యెగిరితెట్టగాను
తానటు మహమత్ ఖానునుగ్రుడై దంటగ బట్టియును
కత్తితీసుకొని హుంకరించినను కనుగొనివాడంతా
నత్తికిసరిగా మహామత్ఖానుని నేయుతప్పకంతా
పూనికోపముతో మహమత్ ఖానుడు వానితలను చేత
మానక కత్తితో వేయుతలచినను మరిదాడకొంత

షేకుమహమ్మదు మహమత్ఖానుని చంపవలదని వేడుకొనుట

లేచుచుగడగడ వణకుచు మరిమరి వేడుకొనుచునేను
పోయెద విడిచిపెట్టినహజరత్ బ్రోవుమునన్ననుచు
కావుమనుచును కాళ్లుబట్టుకొని ఘనముగ నేడ్చుచును
నేవకుండను నీకునునేను కావుకావుమనను
ఇల్లునువిడిచి బిడ్డలువిడిచి యిల్లాలినివిడిచి
వెళ్ళవచ్చితిని పూరకనిప్పుడు వేడుకగాతలచి
వచ్చితియుద్ధము జేయవచ్చిన వాడగాననేను
ఇచట ప్రాణము పోగొట్టుక నన్నిప్పుడువిడువవలెను

తల్లితండ్రివి నీవని నేనిప్పుడు దవరగ వేడెదను
అల్లాసామి విన వేయనుచును అరసికొలిచెదాను
సలామయ్యావో మహామత్ఖానుడ సలామయ్యా నీకూ
బలేశూరుడని నిన్నుచూచుటకు మరివచ్చితి నిటకు
ఇటువలెబలికిన షేకుమహమ్మదు నటుజూచియు వేగా
పటుతరమైన వాక్యంబులుచే బలికినపుడు బాగా
ఇంతశూరుడవు యుద్ధానికి నీ వేలవచ్చినావూ
వింతలయిన నీమాటలనిట నీ వెందుకుపలికెదవు
అనుచును షేకుమహమ్మదు నప్పుడు అంతశత్తితోను
తునకలుగా తెగవేసెను యేనుగులతోడ నదురుగానూ
అనుచు నిలువగా నీలవేణి యా మహామత్ఖానుండు
చల్ చల్ యనుచును చూపుమేరలో చెంజిజూచినాడూ
అనియీతెరగున నారదమునివరు డానతీయగానూ
వినిసురనాథుడు విస్మయమొందుచు వేడ్కనిట్టలనెను
మునినాయక యీ మహామత్ఖానుం డెన్నియేండ్లవాడు
ఘనమగు జగడమునందు శూరుడై కడగినిలిచినాడూ
పిమ్మట యేమియొనర్చె దెల్పుము ప్రియముగమునినాదా
పదిపదునెనిమిది యేండ్లవాడయీ మహామత్ఖానుండు
స్థిరముగ యుద్ధము నిదివరకెన్నడు జేయలేదువాడూ
యెనిమిది వేల గుఱ్ఱంబులను మెచ్చుగాను నరికీ
పనిబూనియు వెయ్యేనుగులను బాగుగానునరికి
మరలి తనదు కాయమునుగని వేడుక పౌరుషజన్మమునిది
పరమముదంబున దేసింగునిగన నరుగును యిటుమీద
వృత్తాంతంబె నొవరగదెల్పెద మెత్తబడగ నేల
యుత్తమశ్వమూ జరుగుమటంచని తత్తరమునచాలా
తనరగదెల్పుచు తిరిగెడు మహామత్ఖానుడు వేగమునా
మనమున దేసింగుని చూచుటకై పరువిడు సమయమున
మహామత్ఖానుడు దేసింగుని చూచుటకు బోవుచుండగా

బంగార్నాయుడు పోనీయక యుద్ధము జేయించుట.

చూచెను బంగార్నాయుడు తనదగు సేనలువచ్చుటను
చూచెడు మహామత్ ఖానునివల్లను వచ్చెననుచునగను

చేయుటవీచుచు గుఱ్ఱపురౌతులచేర్చి గుంపుగానూ
పాయకముట్టడి వేయుఁడు కొట్టుఁడు పట్టుఁడుపరుగుననూ
అనితనసరదారులకు దెలుపుచును అట్టితానువడిని
యినునికై వడి చురచుర మనుచును మొనసిన బొమముడిని
వేయుచు నూరుగుఱ్ఱపురౌతుల వెలయుగానుదెచ్చి
ఘయరుఘయరనుచు వారికి బంగార్నాయు డుత్తరమిచ్చి
మొనలకుచుట్టును తనగుఱ్ఱంబును మోదంబునద్రిప్పి
కనుగొనిసేనల భారగనీయక కాపుజేసిదప్పి
గొనినవారలకు కైవువస్తువులు కోరినట్టులిచ్చి
మొనలో ధైర్యము విడుచుటతగునా మనకనిసెలవిచ్చి
దండనాయకుల గనుగొనపలికెను దాడిజేసిమీరు
కండకొవ్వుచే తిరిగెడు మహమ్మత్ఖానుని వడిగమీరు
చంపిన మీమీజీతములెల్లను చాలహెచ్చుజేసి
పంపుసటుల నేమనవిజేసెద నవాబుతో వ్రాసి
మీరగయుద్ధము చేయుండని వారలనెల్లను మెచ్చి
కార్యతంత్రములు మీ రెఱుంగరె కాల్చుడు దురమునజొచ్చి
మందుగుండులను కాల్బలంబులకు ముందుగనిమ్మనెను
కొండలమందగ నిబ్బరంబునను కీర్తిగ నుండనెను
అని తమసేనా నాయకుడగు బంగార్నాయుడు దెలుప
మనములరగ సేనలు దెలివొందెను మానుషంబుగొలుప
తోటాలెత్తిరి రౌతులందరును పటుధైర్యంబునను
పటాలనుచును పండ్లకొరికి పౌరుషంబుతోనూ
తుపాకులతో పోసిరి మందును తురగపు రౌతులును
సిపాయి బిడ్డలము మేమని వీరాలాపము లాడుచును
సరియనుకొని గట్టించి తుపాకుల నాయత్తము జేసి
మొనలో సరదారు త్తమునకై మోవుజేసినిలిచి
ఉండగతంబుల వాగినముందర జండాలటువెనుక
రెండుకోసముల దూరము తెలియక యెత్తిరి బలుకడగా
ఘమఘమరనుచు సిగ్నల్ గాపెడు పరువడిమేజరును
పాయరోయనుచు యెత్తిరి చెవులను వాయులుమీరగాను
పటపటపటపటపటపటపటయనుచును వడిగాశబ్దములు

చటచటచటచటచటయంచునుం చెలగెను మిడుగుగుళులు
గుప్పుగుప్పునుచు ధూపంబొగగెను ఘోరంబుగనంతట
చెప్పశక్యమా సురపతియిప్పుడు తప్పక వినుమంతట

మహమ్మత్ఖానుడు రెండవతూరి యుద్ధముజేయుటకై రోషము గొనుట.

మహామ్మత్ఖానుడు తుపాకిశబ్దముల నట్టినతని యెంచి
ఇషామడంచెదను తురకలనిప్పుడు నదియెంతనిమించి
నీలవేణిగుఱ్ఱంబును ద్రిప్పెను నీటుమీరగానూ
కాలముదీరెవీరికనుచును కడుకోపముతోనూ
కారుతుపాకుల శబ్దమువినియా పౌరుషంబుచునము
వైరులచే తప్పించదలచియా వన్నెమిగునుహాయము
ముట్టికాలు తావేసుకనిలిచెను ముదముమీరగాను

మహామ్మత్ఖానుడు దేసింగునిజూడ బోవుచుండగా ఫిరగీలచే కాల్చుట.

పట్టుతుపాకుల గుండ్లరవలుతమ తలపై నెగరగను
లేచెనుగుఱ్ఱము నడచెనుకోపము రెపరెపమనగాను
కాచెనురాతును బోర్చికోనెనుతను రాచినకాళ్ళటను
నాదారయగు మహామత్ఖానునిగనుగొని ముదముననిజొచ్చి
కదనంబున నాకడకజూపెదను గానకనుమదినెంచి
పొంచెనుమించెను బలుయుక్తుల దలంచెనీలవేణీ
వంగుచులేచుచు వార్లుచుదుముకుచువచ్చెనీలవేణి
సురసురచూచుచు స్రుక్కుచునిలుచుచుసారిదినడిచెనపుడూ
బిరబిరనడచుచు నాటలాడుచును బారుదెంచెనపుడూ
ఇటువలెగుఱ్ఱము నిమిషమాత్రమున పటురయంబుగానూ
చటులతరంబుగ నబాబుదండులో నీటుగజనగానూ
గుఱ్ఱపురౌతు తోటాలెత్తుక కొరుకునంతలోనా
వుత్తలదరగను మహామత్ఖానుడు బారిగొనియతనున్న
రౌతులుజూచెడి నంతలోపలను రయముమీరగానూ
మోతుబరులపది వేవురనరికెను ఖ్యాతిమీరగానూ
కరకరకరక్కని శబ్దమువినబడు నిరుప్రక్కలయందు
తరిగినకూరాకులవలె ప్రేగులు తలలుబడియెనందు
తలలులేని మొండెంబునునిలబడు తాండవంబులాడు

తల్లడమున దేసింగుడు గుందక తాజనె స్వర్గమునకు
అంతట ఆలరులు గురిసిరి సురలు అతిమోదముతోడ
వింతవిమానము వచ్చినిలిచెనా వీరునిగొనిపోను
నత్తరిదివ్యంబగు నొకతేజము నతనితనువువెడలి
తత్తరమందుచు ప్రజలుజూడగను తర్లెవిమానంబడలి

నబాబు మహామత్ ఖానుని గుఱ్ఱమును పట్టుకరమ్మనుట.

మహామత్ ఖానుడు వడిననబాబు మదిలోహర్షించి
సహజంబుగ నా బంగార్నాయుని చయ్యనటుజూచి
బంగార్నాయుడ మహాత్ ఖానుడు మరిసీగ్లై నేడూ
శృంగారంబుగ నీలవేణిని సొంపుతోడయిపుడు
పట్టుకరమ్మీ వేగమెపొమ్మీ బంగార్నాయుడా
పట్టుపడనో పడదో మనకిప్పుడు బంగార్నాయుడా
మూడువేలగుఱ్ఱంబుల దీసుక మోహారంబుగాను
గాఢంబుగ గుఱ్ఱమును పట్టుకొని గ్రక్కునరమ్మనెను
వేగమె బంగార్నాయుడు నాల్గువేల గుఱ్ఱములతో
తెగువతో నీలవేణిని బట్టగ జాగ్రతగానెంతో
పోయిచూడగను నీలవేణియును పొందుగ నచ్చటను
పాయనుశౌర్యముతోడ గుఱ్ఱముల పరువడిజూచియును
కనలుచు గర్జనజేయుచు నెగురుచు కడువడి దిరుగుచు
కరబలమున గుఱ్ఱంబుల నెల్లను తన్నుచు కరచుచును
గిరగిరదిరుగుచు పరువడిదుముకుచు కినిసియు నాడుచును
పోరబడిగుఱ్ఱపు గుంపులుదూరుచు మరమరిచంపుచును
కమ్మిన కాల్బలములనెల్లను తనకాళ్ళతో తన్నగను
దుమ్ములు మొగరగ గుఱ్ఱపు గుంపులు తుత్తుమురులుగాను
మిఱ్ఱిగ నిలిచిన గుఱ్ఱంబులను మెడలునవుడు కొరికెన్
విఱ్ఱవీగివచ్చిన గుఱ్ఱంబుల వేగముగా నరికెన్
అంతట నాలుగువేల గుఱ్ఱంబులవింత చావుచూచి
చింతతో బంగార్నాయుడు దొరతో చెప్పగనువచ్చి
కనిగుఱ్ఱమును మనకలవిగాదని మనమున నెనుచును
ఘనుడగు మహామ్మత్ఖానునికే సరిగాకయున్న మొదల

ఇటులొనరించగా నెవ్వనిచేనగు తటుకున చూడగను
కటకట యేమనవచ్చును దీనిపటిమయటంచును
నీలవేణియును వ్యసనముచేతను నిలిచిచూచివగచి

దేసింగు నీలవేణివచ్చుటనుజూచి వ్యసనము జెందుట.

చాలదుఃఖముతో రాజువద్దికిని చక్కగరాజూచి
యేమిజేసితివి మహామత్ఖానుని ఇపుడునీలవేణి
యేమాయెను నాప్రాణసఖుండతడిపుడునీలవేణి
యెచ్చటమహామత్ఖానుడు పడ్డాడదియు చూపుమనిన
వచ్చుటకిని యానీలవేణియు అరయురమ్మనిన
పోయిశీఘ్రముగ మహామత్ ఖానుని పొగలుచు తామించి
పోయెపోయె నాప్రాణసంఖుడని పొగడియునటుగాంచి
వాసిగనప్పుడు దేసింగుడుబల్ వ్యసనముతోడుతను
యీసుననినునే వొంటిగా నెటులనుందు నేనూ
నీవుముందుజని నాకొకజాగా నేనుపచవయ్యా
పావకాళమిక లేదునలాబును చంపివస్తునయ్యా
అనుచును గుందుచు నిట్టటుబడుచును నిలబడిపొర్లుచును
కనుగొనియేడ్చుచు కన్నులుమూయుచు కడువ్యసనముతోనూ
మహామత్ ఖానునకు గోరియచ్చట మరియుకట్టుకును
బహుళా పల్లముత్రొవ్వించెను నాపట్టునయ్యవను
పల్లములోనా మహామత్ ఖానుని పట్టియుంచగామా
యెల్లవారలు జూచుచుండగా నెంత తెగువతోనూ
వచ్చియు గుంటచుట్టుచును వడిగానీలవేణి
యచ్చటనిలబడి కన్నీరుంచె నంతనీలవేణి
కనుగొనియప్పుడు దేసింగుడుతా ఘనశోకముతోను
మనమునగుందుచు నీలవేణిని మహామత్ ఖానితోను
పనుపుటలెన్నని ఖడ్గముగొని తాపరగనరికియంత
ఘనమగు తేజినిపల్లంబున కడగిచేర్చికొక
గోదానంబులు భూదానంబులు కోటిస్వర్గములును
భూదేవతలకు సంతోషంబుగ పొందుగనిచ్చియును
తప్పక దేసింగుడును తనజమేదారునటుజూచి
ఇప్పుడుపల్కెడనన్నలార మీరందరువినమించి

## దేసింగుమహారాజు నబాబుతో యుద్ధము జేయుటకు బోవుట.

మహామత్ ఖానినుతో సగబలమును మరితగ్గెనునాకు
సహజంబుగ నాకేమి బలమును చయ్యన లేదిటకు
చయ్యననిప్పుడు నాబలంబుతో జేరిదండులోను
చయ్యనజొచ్చి నబాబునుబట్టి నేనునుచంపెదను
జాగ్రతతోడనురండు మీరలును జమేదారులారా
అగ్రమంబునను డంచు మీరును జమేదారులారా
చొరబడిశూరుల పట్టిచంపుడు గరిమతో వారలను
నరుకుడు యేనుగు గుఱ్ఱముల మఱియుతిధైర్యంబుగను
పరుగిడువారల పరువడిమీరలు పట్టవద్దుసుమీ
జరిగినవారల జడిసినవారల జంపవలదుసుమీ
యేమరియుండిన వారలమీరలు నెదిరించగవలదు
హైమరచియు లాహిరిచేసుండిన వారినిజంపవలదు
అనుచును దేసింగుడు తనబారాహజారినటుజూచి
ఘనముగ పంచ్రెండుకమ్ములుగల ఘనతేజినిగాంచి
చెలువుతో నెక్కి మీసముదీటిచేత కత్తిబట్టి
చల్ చల్ బాయని నడిపించెను గుఱ్ఱిము చేబట్టి
సింగమువలె గర్జనజేసెను దేసింగుండంతటను
రంగుగపులివలె రొప్పొనప్పుడు దేసింగుండంతటను
నబాబుగనుగొని బంగార్నాయుని నంతలోనబిలిచి
డపాల్ పరుసగా ఫిరంగీలను తయారుజేయించి
మనదండెల్లను నొక్కచోటను మరిమోహారముగను
ఘనముగబెట్టుము బంగార్నాయుడ గ్రక్కుననిప్పుడును
శూరుడైన దేసి గుఱ్ఱమెక్కి చు జాడుమిపుడువాన
బారాహజారి నెక్కివచ్చె ను బకు వసీవిటపూని
యిటులనుండిన దేసి గుఱ్ఱము యీదండులో జొచ్చి
పటుతరంబుగను చిమటాయిచ్చెను బారహజారినిమెచ్చి
ఇటులహజారికి చిమటాయిచ్చిన పటపటపటయనుచు
పటుతరముగ నిటువచ్చినగనుగొని వరుసఫిరంగీలిడుచు
ఒక్కఫలితా ధాంధాంయనుచును యుక్కడశాల్చగను

చక్కగవచ్చియు గుండుసందులో గ్రక్కనదూరగను
బారహజారితోడను పొగలోబడి వడిదూరుచును
మార్ మార్ మారనీ దేసింగుడు వడిగజేర వరకగాను

## దేసింగుడు దావుత్ ఖానునితో పోరుట.

చేతిపట్టు దావుత్ఖానుడు చెచ్చెరజొచ్చియును
ఘాతవేయుచును పెద్ద ఫిరంగీలను కొంతకాల్చిరపుడు
అంతవెనక యేనూర్ గుఱ్ఱంబుల నమరబంపినాడు
మందుపోటుకును గుండుపోటుకునుసందేహించకను
సరదునబడిదూరుచు పైకెగురును సరగునహయములను
గిరగిర ద్రిప్పుచు నెగరవేయుచు కరికరిసేయుచును
సరగున దండుతండంబుల సవ్యాపసవ్యములుగాను
తరుముచు నరికెను దేసింగుడును కఱకఱకరుకుమనుచు
మరిగుఱ్ఱంబుల తుండ్లుతుండ్లుగా నరికినరికి వేసి
అరటికంభముల నరికినకరణిని యంతదండు నెల్ల
సొరకాయల తెగనరికినకరణిని సొరదిసేనతెల్ల
జొన్నదంట్లు తెగవేసిన తీరున చొరబడిదండులను
ఉన్నవారినటు చాపకట్టుగా నుక్కడంచుచును
ఇటులజేయగా దావుత్ ఖానుడు చటుల కోపమునను
పటుతరమగు పదివేలఫిరంగుల వదిలపరచియుటను
ఒక్కపలీతా తీర్చినాడయా యుదండంబుగను
చక్కగ పెటపెటమ పెఠాలనుచునుశబ్దంబులతోను
వచ్చెడు గుండుకు పైకెనెగసెను చెచ్చెఱగుఱ్ఱమును
చిక్కనదారిని గ్రక్కునమారెను పెక్కువిధంబులను
నెక్కడజూచిన దేసింగువివలె నెక్కనుండగను
మరుగుజేరుచును పరుగెత్తుచును తిరిగిచూచుకొనుచు
విరిగినదండును దావుత్ ఖానుడు వెసనుజూచిపగచు
దండునెల్ల నొకచోటనిల్పి ఖండితంబుగాను
మెండుగ ముప్పదివేలతుపాకుల మోతశబ్దములను
ఒక్కపలితా దీర్చినగుండ్లను వెక్కసంబుగాను
పెక్కువిధములై మండెడిమంటలో పేర్చియుగుఱ్ఱమును

మొగిరిదాటుచు వాగలోదూరుచు యిటునటు తిరుగగను
దిగువపడిరియా నవాబుదండు తెరలుమూఁటలోనూ
వేయిగుఱ్ఱములు నొక్కసారిగా వేగరాగజూచి
నామెడ బారాహజారిదాటెను వంతదానిమించి
ఒక్కక త్రిప్పి వెయ్యికత్తులు నొక్కసారిగా
వెక్కసంబులేకను దేసింగుడు విరిచెనన్ని వేగా
చాలగ దావుత్ఖానుండును పదివేలగుఱ్ఱములను
మేలగురాతుల తోడనుబంపెను మిక్కుటంబుగాను
వచ్చినగుఱ్ఱంబుల దేసింగుడు వరుసగానుజూచి
ఇచ్చెను చిమటా బారాహజారికి మొడమరాలిమించి
పటపటపటపటయని దౌడాయించె బారాహజారియును
చటుకులకోపమున దేశింగుడును దావుత్ఖానుడును
యెదురుగ బారాహజారిద్రిప్పెను హెచ్చుశౌర్యమునను
అదిగనుగొని యాదావుత్ఖానుడు మదమేనుంగులను

## దావుత్‌ఖానుడు మదమేనుంగుల సమూహములను దేసింగునిపై గదియబంపుట.

అరువదివేల మావటీలతో హెచ్చుగానువచ్చి
సరగునతొండంబుక రోకండ్లను చక్కగానుదాల్చి
విసరుచు వచ్చెను నలుదిక్కులను పెనుజనులుబెదర
కసరుచువచ్చి దేసింగుని పైకమ్మి గొండలదర
ఘీంకారింపుచు తొండములెత్తుచు గిరగిర దిరుగుచును
శంకలేక రోకండ్లను ద్రిప్పుచు చాలగవచ్చినను
చూచియప్పుడు దేసింగుడును చోద్యంబందుచును
యోచింపక నాయేనుంగు గుంపులో నొప్పుగగుఱ్ఱమును
కదలించగననుచు తావడిజొచ్చి కడునుగ్రుండనుచు
పదిలముగా తనచేతను బాలాబట్టి విజృంభించుచును
తొండంబులనెల్లను పడనరికెను తుండ్లుతుండ్లుగాను
కంఠస్థలముల గ్రుచ్చిమొత్తెను కంతులురాలగాను
మొండెములుగ తెగనరికెను యాబల్ తుండంబులనెల్ల
మెండుగనెత్తుర యేరై బారెను మేటిదంతులనెల్ల

పరివడి కుంభస్థలములు పొడిపైబడె నప్పుడు కొన్ని
నరికినంతలో రెండుతుండ్లుగా నటగూలెను కొన్ని
కాళ్లుచేతులు తోకలువిరిగి కదసికూలెకొన్ని
ఒళ్లెల్లను చిల్లులుపోటుబడి వొరిగెనంతకొన్ని
పేగులుకండలు వేరువేరులై మూల్గికూలెకొన్ని
సాగిలపడి పొర్లింతలుబెట్టెను చయ్యాననటకొన్ని
ఆర్భటార్ టూర్ జేసెను అప్పుడు దేసింగూ
బారాహాజారికి చిమటాయిచ్చెను బరువడిదేసింగూ
దావుత్ఖానుండుండె తావుకు తడయక ద్రిప్పగనూ
దోవలేక యీ పీనుగపెంటల ద్రొక్కుచు నంతటను
యేనుగుపై అంబారిలో దావుత్ ఖాను డంతజూచి
మానక దేసింగుడును చిమటా బారహాజారికినిచ్చి
యెడమకాలికి నివ్వగనప్పుడు యెగిరియదుముకుచును
తడయక దావుత్ ఖానుని యేనుగ దగ్గరనిలువగను
చలరేగియు తన బారాహాజారిని చేతపట్టగానూ
నిలచిముందరికాళ్ళను యేనుగనెత్తినపెట్టగను
కడుకోపముతో మావటివానిని కదసిచేతబట్టి
నడిగలక త్రిని ఝులిపించప్పుడు వానితలనుగొట్టి
ఉగ్రుడనుచు యీ దావుత్ ఖానుని వొడిసిపట్టగానూ
నిగ్రహింపలేక దేసింగుని నెరచిపొగడుట
అప్పుడుమనమున నిశ్చయించి వోయన్నా దేసింగు
తప్పక నే నీ కాళ్ళకుమ్రొక్కెద దనరగ దేసింగూ
విడిచిపెట్టినను పరుగెత్తెదను వేగము దేసింగుకుగూ
బడేశూరుడవు దయనన్నేలుము బాలుడ దేసింగూ

దావుత్ఖానుడు చంపవలదని వేడుకొనగా
దేసింగురాజు నబాబువీదేయిని నిశ్చయించి యమపురికనుపుట.

అదివిని దేసింగుడు దావుత్ఖానునివేగముజూచి
ఘనుడగునబాబు వీడేయనుచును కదువడిమదినెంచి
బాలా వేసిన దావిత్ఖానుడు బడినీల్గెనపుడూ
చాలగనబాబు దండులోనందరు సరిగబారిరవు

కొందరు బాదుచు నేలకూలుచును కొందలమందుచును
కొందరుదాగుచు తిరిగిచూచుచును కొందరువగచుచును
నబాబుసేనలు పటాపంచలై నటచెడిపారగను
తత్తరపడి పరుగెత్తువారిపై కత్తియెత్తరాలేదూ
సత్తులేక నిలచినవారలపై కత్తియెత్తరాలేదూ
ఇరువదియారు వత్సరములవా డిప్పుడు దేసింగూ
సరగున యాపై వేలగుఱ్ఱముల జంపెను దేసింగూ
రెండువేల యేనుంగులగుంపును ఖండిగ దేసింగూ
మొండుసేనలను జంపెనప్పుడు మేటిగ దేసింగూ
ఇరువదినాలుగు జండాలన్నియు బరువడి దేసింగూ
సరగున పెటపెట త్రుంచి వేసెను చయ్యన దేసింగూ
అప్పుడు దేసింగుడు చెయ్యాలసి నపుడు తానునిలిచి
యొప్పుగ శత్తురు గొలువుసువులను కత్తినంతజూచి

**దేసింగుడు వావృక్షానునిజంపి శంకరాభరణ నదిగట్టున గూర్చుండుట.**

ఇంకనేల యానవాబుచచ్చెను శంకలేక నేనూ
శంకరాభరణ నదిలోపలనే స్నానముజేయుటకు
పోయెదననుచును నైదుగుఱ్ఱముల పొందుగానుగూడి
ఆయెడబారా హజారినెక్కియు సంతసచటచేరీ
వచ్చిశంకరాభరణముగట్టున పడలకతానిలచి
అచ్చట బారాహజారిడిగ్గి యంతనీళ్ళజొచ్చి
వుడువులుగడుగక కత్తినికడిగెను నొప్పుగ దేసింగూ
బడలికదీర స్నానము జేసెను బాలుడు దేసింగూ
మూడుదోసిలినీరునుద్రాగెను మరియును దేసింగూ
నీడనుజేరి కూర్చొనెనప్పుడు నిజముగ దేసింగూ
సహజము నవాబుగ చంపితి ననుచును సంతోషించుచును
మహామక్షానుడు పోయెననుచును మరిమరిగుందుచును

**ధనిసింగుడను దాయాది దేసింగునివద్దకివచ్చి**
**నబాబు నీచే జావలేదని దెలుపుట**

ఇటులనున్న దేసింగునివద్దికి తటుకుననప్పుడును
పటుతరముగ ధనసింగుడువచ్చి పలికెనతనితోనూ

రాంరాంసీతారాం రాంరాంరాం రాజాదేసింగూ
సరగునవచ్చిన పనియేమిరా స్వామీదేసింగూ
ఇరవుగయుద్ధము విడిచివచ్చితే యిప్పుడు దేసింగూ
ఆమాటలువిని దేసింగుడుతా నప్పుడిట్లనెను
యేమియున్నదిక నబాబుచచ్చెను యింక యుద్ధముననూ
ధనసింగుడు నామాటలువిని తత్తరపడి యిట్లనెనూ
ఘనతగనీచే జచ్చినవాడు దావుత్ఖానుడును
సగముబలము పోయినదని గుందుచు సంకటమందుచును
నడిచెడియుద్ధము చేయలేక మికను పొగలినబాబటను
కొండలసందున సాదుల్లాఖానుడు కోరిదాగినాడు
దండెల్లను నదాడికోర్వగను దాగియున్నదిపుడూ
శత్రువేషనింతైనను నిల్వగ జనదిక దేసింగూ
మిత్రుడవనినే నీకుదెలిపితి మేలగు దేసింగు
జల్ది జల్ది బయులుదేరుమీ జలదిగ దేసింగూ
వలదికపగను నబాబుగూల్చెను జలదిగ దేసింగు
అతనిమాటలు వినితాసలరుచు నంతట దేసింగు
మితిమీరిన సంతసమున బొదలుచు మీరెను దేసింగు
బారాహజారిని దగ్గర తెమ్మని బరువడి దేసింగు

రంగనాధుడు దేసింగుని యుద్ధమున నుద్యుక్తుడై నంతట
బోవలదని బుద్ధులు గరపుట.

శూరత్వంబున కత్తినిబట్టెను సొంపుగ దేసింగు
నారాయణశౌరియనిమొక్కెను బారాహజారిపైని
ధీరుండార్భరు సరధారలతో తెంపునకూడుకొని
వెడలగ తనపాలిటిరంగేశుని వెనుకనిలువగానూ
కడువడి దేశింగునిరంగేశుని కనులపండువుగను
కనుగొని శ్రీహరిపాదపద్మముల కప్పుడు మ్రొక్కుచును
నినునమ్మితి శ్రీరంగనాయక నన్నువిడుచుటలును
పనిగాదుర యీ సమయంబునను పరగరంగనాధా
అనువుగ నన్నేలక తొలగినను యపయసస్సుగాదా
అనిపలికిన శ్రీకస్తురిరంగ డతనిజూచి మెచ్చి

వినరాయుద్ధము యీ దినమందు వేడ్కతోడజేసి
బహుప్రయాసపడి యలసినవాడవు బాలుడ దేసింగు
సహజంబుగ రేపటికి జయమగు చయ్యన దేసింగు
బాలుండవు నా మాటలు వినుమిక బరువడి దేసింగు
చాలుచాలు యీ దినమున యుద్ధము చాలుర దేసింగు
మూడుముక్కాల్ ఘడియవరకునే ముదమునొదవగాను
తోడుగనుంటిని యీ దీనంబు నిలుకూడ నింక నేనూ
నీకుసహాయముగాను రేపటికి నిశ్చయంబుగానూ
ప్రాకటమున నేబోయివస్తునా పల్కువినుము నేను
ఘనమగు తనశూరత్వము దెలియగ నిలుతురంగనితోను
మొనగాడగు దేసింగురంగని కనుగొని యిట్లనెను
ప్రేమతో మీదయ యీగతినుండగ నేమికొదువయికను
స్వామీ నామాటలు వినుమిప్పుడు సరగున జెప్పుదను
చయ్యనయుద్ధములోన నబాబును చంపెదనదిరెయొకటి
రెమ్వ్యేడ నాతనిచే తనువులు నొయ్యన విడుచుటొకటి
ఆరునూరులో చావులు తప్పదు యది నిశ్చయమయ్యా
ధీరులైనవారికి ప్రాణముపై దృష్టిగలుగదయ్యా
దండులోన జయమొందగ నీ కృపదయచేయగదయ్యా
దండునీల్గినవారికి నీడగు దండంగదయ్యా

దేసింగు మహారాజు రెండవతూరి

యుద్ధమునకు బోవుట.

పోయివత్తునని బారాహజారిని పొందుగనెక్కికొని
పాయక నెడను కాలికి చిమటా పరగనివ్వవడిని
పటపటపటపటయని దౌడాయించెను బారాహజారియును
తటుకునదండునుండు తావుకు దగరపోవగను
ఉండునబాబు దండులో వారును వొప్పుగాను నవుడు
దండిమైన దేసింగు దూరికి తానుబోయినాడు
యింకమీద మనకందరికిను నిపుడేమిభయంబనుచూ
శంకలేక మనవూరికిపోదము చయ్యనరండనుచూ.
అంతన బాబునుగూడి గుంపుగ నచ్చటనుండగానూ

చెంతకువచ్చిన యాదేసింగుని సరగు నబాబటను
చూచిసింహామునుగన్న మత్తేభము చొప్పునవడకుచును
ఆచెంతను పులిగన్న లేడివలె యెట్టిటు బెదరుచును
పిల్లినిగన్న చిలుకచందమునంబెదరిచూచుచును
పల్లదప్పి వలలోపడినట్టి వనమృగంబువలెను
అదరిపడుచు నట్టిటుజూచుచు పెదవులుతడువుచును
యిదోవచ్చెను దేసింగుడు నికనేమిచేతునననూ

నబాబు తోండ్రమల్లునిబిలిచి దేసింగునికడకు
సమాధానమునకు సంధికంపుట.

గడగడవణకుచు తోండ్రమల్లుని వడిగనవుడుబిలచి
తడయకబల్కెను నబాబప్పుడు తప్పకతనిజూచి
తొందరగలిగెను యేమిచేతునో తోండ్రమల్లన్నా
ముందుగ నాప్రాణములుంగాచుటకు ముఖ్యుడవునీవన్న
అనినబాబుతో తోండ్రమల్లుడు అప్పుడుయిట్లనియె
పనియేమిక సెలవియ్యండన్న నబాబతనితోననియె
దేసింగుడు మనతండునెల్లను తెగువతోఛేదించి
ఘోసురముగ వాడూరికేగెనని భయమువిడిచిమించి
వుంటియిదో దేసింగుడువచ్చెను వొప్పుగాను
కండ్లజూచుటకు భయముగనున్నదిగట్టిగనామదిని
ఒక్కకార్యమున్నది నేనిప్పుడు వొప్పుచెప్పెదను
చక్కగాను నీవతనికినాకును సంధిచేయవలెను
దొరతనమును నీకిచ్చెదననుచును తోండ్రమల్లోజీ
సరగున నార్కాడ్వెడ్క నేలుమను చయ్యనమల్లోజీ
పట్టము కట్టించెదనని యతనితోబలుకుమునీవన్న
నేనుబంటుగా నతనికొల్తునని నిజముగపలుకన్న
మావక నేనీదాసుడనను మరిమరిపలుకన్నా
యిటులనబాబు తోండ్రమల్లుతో పటుతరంబుగాను
తటుకునదెలుపగ మదిభయంబుగొని తడబడిలేచియును
సలాముజేసి తోండ్రమల్లుడు చయ్యన నటువచ్చి
బలేనూరుడగు దేసింగునికి మరియెదురుగవచ్చి

## తోండ్రమల్లోజి దేసింగుని సంధిచేయుట-

రాంరాంరాంరాంరాంరాం రాజా దేసింగూ
రాంరాంరామనెనప్పుడు రాజగు దేసింగూ
భయము చెంది నేవచ్చినానయా బాలుడ దేసింగూ
దయతోడుత నామనవి వినుమయ్యా తడయక దేసింగూ
చెలువుమీరగా నబాబుమీతో సంధిజేయుమనెనూ
చలముసేయకను వినుడుజెప్పెదను సవిస్తరంబుగాను
దొరతనమునునీకిచ్చెదనేను బరువడి దేసింగు
నరగున నార్కాడ్వేడ్కనేలుమని స్థిరముగ దేసింగు
పట్టమునీకే కట్టెదననుచును పలికెను దేసింగు
పట్టుగరాజ్యము నిన్నేలగమన బాలుడ దేసింగు
నీకుబంటనై నేనుండెదనని నిజముగ దేసింగు
జోకతోడ నీదాసుడనేనని తెంపుగ దేసింగు
యిటులనబాబు చెప్పిపంపెను యిప్పుడు దేసింగు
పటుతరముగ శ్రీరామవాక్యముగబలికెను దేసింగు

## దేసింగురాజు తోండ్రమల్లోజితో యుద్ధముజేయుటే యుక్తమని జెప్పుట.

అన్నపప్పుడా తోండ్రమల్లునిగని యంతనుగ్రుడగుచు
కన్నులెఱ్ఱగను జేయుచుపలికెను ఘనకోపుండగుచూ
మరియీమాటయేలను తోండ్రమల్లోజియప్పుడును
బరువడి యుద్ధముఖంబున బలికెదుపలుకు లెవ్వియనెను
కాదునీవిటుల సందికివచ్చిన నప్పుడువొప్పుదును
నేడిటుబలికిన నాటిభీరములు నేయుడవినిజనెను
దనరనబాబుకు హితుడగు దావుత్ ఖానుడుబోవుటను
ఘనుడగు నాస్నేహితుడగు మహమ్మత్ఖానుడు నీల్గుటను
ఇద్దరుశూరులు తెగినవెనుక మాకింకమాటలేల
యుద్ధముజేసియు మాలబలంబులతో నొప్పగనేవేళ
చావగవలయును గాకయింక యీ సంధియేటికనెను
సావుజేయవలె డంధులో తెగబడి చయ్యనయిప్పుడునూ
శూరులయి తురకలమీరంతయు భయపడగనే

వీరుడయిన మీా నబాబుకిప్పుడు వేరెమాటలేలా
పకపకనవ్వుచు దేసింగుండియిపలికి యతనితోనూ
యికనొకటున్నది తోండ్రమల్లు నేనిప్పుడె జెప్పెదానూ
చెలగిన బాబుకు బలముగలిగితె చెంజి నేలుమనెనూ
బలమునాకుగలిగిన నార్కాడు ప్రబలముగా నేలెదనూ
యీావిధములు నాకిప్పుడు వేరేయేమిలేదు వినుము
నావిధమంతయు మీా నబాబుతో నరయబలుకుపొమ్ము
జల్దీజల్దీ మీా నబాబునిప్పుడు జల్దిదిగరమ్మనుము
జల్దిగ నేనిదావచ్చెదనీవును జల్దిదిగానుపొమ్ము
మరిమరిసలాము జేసియు తోండ్రమల్లు డప్పుడును
నిరిగి నబాబుకు విశదంబుగ నీ తెరగెరిగించగను
అదరిపడియు బంగార్నాయుని తా నంతలోనజూచి
పెదవులుదడుపుచు పలికెనప్పుడు పెంపుదప్పి లేచి
యేమిచేయుదును బంగార్నాయుడ యేమితోచలేదు
యేమిచేసినను నీదేభారము యేమిర నాకికమీాదు

బంగార్నాయుడు దేసింగు మహారాజుమీాదికి ఆరణి వెంకట్రావును
సేనాసమూహముతో యుద్ధమునకు బంపుట.

అనివిని బంగార్నాయుం డప్పుడు అతిధైర్యంబుననూ
ఘనుడగు వేంట్రావునుజూచి కడువేగంబునను
శంకలేక యేనూర్ గుఱ్ఱములను వేంకట్రాయూడా
ఇంతతీసుకొని రమ్మిటు జల్దిదిగ వేంకట్రాయుడా
దేసింగునికిని యెదురుగబొమ్ము తెగువతోడనిపుడు
వాసిమీారగను యుద్ధము జేయను వదలకజనునేడూ
సరగున యబ్దుల్ ఖాదరుకాను సాయబుదండునను
బరావడికొలుముత్ ఖానుడు నీకు మరిసహాయముగను
వచ్చెనరిప్పుడు వేగమెబొమ్ము వారిగూడియునిన
నచ్చటనందరు దండుగూర్చుకొని వచ్చినిలచియున్న
దేసింగుండటు బారాహజారిని తెగువతోనకూర్కొని
వాసిమీారగను చిమటా యిచ్చెను వదలకపటువూని
దడదడమని దాడాయించెను దండుమీాదికపుడు

గడగడమనుచును వణకిరిదండులో గలవారలునవుడు
చూచిరిభ్రమము జెందిరికొందరు సోలిరికొందరును
ఆచెంతను నిలువక పరుగిడిరి వందున కొందరును
మేముయుద్ధమునకురాలేమన మొలగిరికొందరును
మోమువంచుకొని చేతునెత్తుకొని మ్రొక్కిరి కొందరును
కలదండెల్లను జూడగయట్టిటు కల్లోలంబగుచూ
వెలవెలబారుచు నిట్టటుజూచుచు వేమరుగునజనుడు
యిటులుండుతరి దండునజొచ్చెను నట్టన దేసింగు
పట్టుగ పట్టాకత్తిని కరమున పట్టుక దేసింగు
గిరగిరబారా హాజారినప్పుడు గిరగిర ద్రిప్పుచునూ
కరకరకరుక్కని తలలనెల్లను కరుకని నరుకుచును
గుఱ్ఱంబులగని రెండుతుండ్లుగా గురుతుగ నరుకుచును
విఱ్ఱవీగు రౌతుల తలలురులగ విసరుచు నరుకుచును
రౌతులనెల్లను తలలుకాళ్ళను చేతులు నరుకుచును
ఘాతవేయుచును యట్టిటు దిరుగుచు కదసి రంగమునను
కరములు శిరములు నురములు మరి తెగవేయుచును
చరణంబులు దేహావరణంబులు నూరుములు జేయుచును
రావులుదప్పి పేర్వులనెల్లను పోర్వులుజేయుచును
కావుకావుమని వేడినవారల గ్రక్కునవిడుచుచును
నీవేదిక్కని నమ్మితి మన్నన నెనరున వదలుచును
సేవకులము నినుగొలిచెద మన్నను చెరపక బ్రోచుచును
యీరీతిని మార్మారని బలుకుచు శూరుడు దేసింగు
పోరుడుపోరుండని రౌతులతో పోరును దేసింగు
అప్పుడు ఆరణివెంకటాద్రియుడు వొప్పుగ దండునుజూచి
గొప్పయేనుగపై నుండెడివానిని నప్పుడంతగాంచి
చెలువుమీరయా బారహాజారికి చిమటాయివ్వగను
కలకలమనుచు గర్జనజేయుచు కదసిపోవగాను
శీఘ్రముగా దేసింగుడు తేజికి చిమటాయివ్వగను
అగ్రహంబునను ముందరి తనకాళ్ళంత రొమ్ముత్తియుటను
యేనుగుతలపై బెట్టినంతలో తానుకోపమునను
వాసిజూచియును మావటివాడును వడవడవణకగను

దేసింగుడును మూవటివానిని తెగువతోనరకగను
కావితప్పి వెంకటాద్రివప్పుడు వడవడవణకగను

నబాబు వేంకట్రాయునిబిలిచి దేసింగుకడకు సంధికంపుట.

పట్టుకొనియు తెననరకవూనగను బదులుపలికితేను
ఎట్టులౌనోయని వెంకటాద్రియుడు నెంతోబెదరుచును
నిలువంగీలను చింపివడిగ తాజంధ్యముజూపుచును
చలముచేయకుము బ్రాహ్మణుడను ననుచంపగబనదనెను
చూచిబ్రాహ్మణుని చంపకూడదని సొంపుగ దేసింగు
వాసిమీరగను నావలిదండుకు వచ్చెను దేసింగు
మొదమ కాలికి చిమటాయిచ్చెను యంతట తేజికిని
కడు వేగముతో దేశింగుడు ఘనకత్తి చేతబూని
దోసకాయను కోసినట్టుగా తొడిబడి నరుకుచునూ
వాసిగ టెంకాయలబుఱ్ఱలవలె పడిగతలలంటుపడగానూ
మిడిమేలపు మృత్యువువలెబట్టి మొడలటు విసరుచును
కడువడియుడవుల కాన్చువచ్చెను కాలాగ్నివలెను
పొడుచుచునరుకుచు కత్తియెత్తుచును పొడిపొడిచేయుచును
వడిగలయేనుగు గుఱ్ఱంబులమరి తొడబడిరిరుగుచును
వాలుకోట యబ్దుల్ ఖాదరుని వదలక పట్టుకొని
చాలగరెండు తుండ్లుగనరికెను సరిగకత్తిబూని
కళ్ళకురంజి ఖానుసాయబును కడతుండ్లుగానూ
కళ్ళికోటయేల్ కొలుమత్ ఖానుని కత్తితోతలగోసి
మధురయేలు మలయాళవువానిని మరిమరి తలనరికి
యదలించియు వీరునటులదోలి యావలికిని యురికి
సరగనబాబటు యున్న పాళెమును చక్కగానుజూచి
త్వరలోబారాహజారికి చిమటా యిచ్చెను మరిమించి
ధగధగమెరసెడి కత్తిచేతను తానటుఝళిపించి
నిగనిగమెరసెడి బాలాచేతను నేర్పుగధరియించి

నబాబుతన్ను విడిచిపెట్టమని దేసింగుని వేడుకొనుట.

యేనుగపై నున్నట్టినబాబును తానంతటజూచి
వానికబారా హజారికిచిమటా పొందుగానుయిచ్చి

నందున బారా హజారితాప్పుడు నతిధైర్యంబుగనూ
ముందరి కాళ్ళటు యేనుగతలపై మోపుగ పెట్టగను
అప్పుడు దేసింగుడు తనచేతిన కత్తిబట్టి
తప్పక ముష్టికుని చెయిబట్టి తల తెగడగొట్టి
బాలాచేతను ధరియించినయా నబాబతనిజూచి
చాలగ దేసింగునితోననెను మేలుపొగడదలచి
యుద్ధముచేయుగ నేరలేదు నొప్పుగ దేసింగు
ఇందరితో నీసమానులెవ్వరు యిప్పుడు దేసింగు
నారాజ్యము నీకిచ్చెదనయ్యా నన్నువిడువుమయ్యా
ధీర్ఘతంబున యార్కాడిప్పుడు జేరియేలుమయ్యా
ఒక్కకొళ్ళకు నూరుకోళ్ళలు వొప్పుగనిచ్చెదను
వొక్కచెరకునే నూరుచెరలను వొనరగనిచ్చెదను
నీమామూలము నీకిచ్చెదను స్థిరముగ దేసింగు
మామూల్ శాసనమును నీకిచ్చెద మరిమరి దేసింగు
నామీదనుదయ చాలవుంచుము అయ్యా దేసింగు
నీమీదను యుద్ధానికి రాలేదిప్పుడు దేసింగు

దేసింగుడు నబాబు యుద్ధంబుజేయుట.

నన్నువిడిచితె పారిపోయెద నప్పా దేసింగు
చిన్నవాండ్లను విడుచివచ్చితిని చెలువుగ దేసింగు
సలాంజేసెదను నన్నువిడువుము చయ్యన దేసింగు
బలశూరుడవు నిన్ను మెచ్చితిని బరువడి దేసింగు
నిజముగ నాపాలల్లాసామివి నీవే దేసింగు
గజిబిజియాయెను నా ప్రాణములు కనుగొని దేసింగు
వేలవెలబోయిన నబాబుతోడను వేమరుబల్కుచును
చెలువుతోడ యానబాబునుగమగొని కలకలనవ్వుచును
సంధిచేయుటలు నాడేయుండెను సాదుల్ ఖానుండా
యింకుకయిన్ని మాటలాడెదవు యిచ్చటనాతోడ
మొదట తోండ్రమల్లోజితో చెప్పిన మాటలుమరచితివో
యెదుటనిలువనను దేసింగుడని యిప్పుడు నెంచితివో నీకు
నూటయెనిమిది పాహాల్ సైకం వొ[illegible]గనుండగను

ధాటిగ చెంజీరూకలు లేకను తక్కువాయెనటను
నీకుబలంబులు జమేదారులు నిజముగనుండగను
ఈగోలదిన బలుకగదగునా నీవిప్పుడు చులకగను
చెంజిపైకము దీసుకొనుము నాచేతికత్తి కొమ్మనను
రంజితంబుగా రూకలు జూడుము రయముగ బాలా మొనను
డట్టుపట్టు రూకలుయిదో వచ్చెను పట్టుమనుచు నతడు
దిట్టముగా తనచేతను బాలా పట్టి యెత్తినపుడూ
తలమీదికి యదో బాలావచ్చెను తప్పించుకొనుము
చెలువుతో కత్తి మెడకువచ్చెను తెగలక యిటు కదలుము
నికనీవు నాతో నికనయినను గెలువు సమరముననూ
అని దేసింగుడు పలుకుచుండగ నాసమయంబుననూ
ఘనమగు యేనుగు క్రింద తొట్టిల్లోగల మాష్టికునును
కనుగొని గుఱ్ఱము వెనకకాళ్లు కట్టి కత్తితో నరకగను
తెగవేయంగను మూడుకాళ్లతో తెగువతో గుఱ్ఱమును
యెగిసి దండపై పడనప్పుడతండెనసి కత్తితోనూ
పొడిపొడిజేయుచు దండునెల్లను పొడచి జెరుచుచును
వడిగా కత్తితో తుండ్లుజేయుచును వదలక తిరుగుచును
అప్పుడు దేసింగుడు నబాబును యంతజూచి పచ్చ
తప్పక బారా హజారికప్పుడు తగినచిమటాయిచ్చి
అంతటగుఱ్ఱము ముందరికాళ్లను అటయేనుగుతలను
గంతు వేసి పెట్టిన మాష్టీకుడు కడువడితోడుతనూ
ఘనమగు గుఱ్ఱపుకాళ్ళ నప్పుడు కత్తిచేత రెండు
తునకలుగా రెంటవకాలును పడి తుండించగ రెండు
పడి వెనుకటిపాదములు దెగనంతట బారాహజారియును
వడిగాగూలిన దేసింగుమగని నాజసి దుమికియును

యేనుగుకడుపు క్రింద కట్టిన తొట్టినుండు మాష్టీకుడు
గుఱ్ఱపు వెనుకటికాళ్ళను తెగవేయుట.

కదలుమకన్నులు యెఱ్ఱగ జేయుచు కోపంబునను
తనచేతికత్తిని దూసికొని తనగుఱ్ఱముసటను
సంగున రెండుతునుకలుగ నరికి చాలనుబ్బడనుచు

బరువడిదండున పాదచారియై చొరబడి పొగరణచి
గిరగిర తిరుగుచు కత్తులు విసరుచు కినిసియునురుకుచును
తరిమి వేయుచును తలలుగొట్టుచును నుదరము జూపుచును
పసచెడికొందరు పాఱిపోవగని పకపక నవ్వుచును
రసికులయిన యాపీరుల దురుముచు రంకెలు వేయుచును
ముందుగ నరికి కండలు ప్రేవులు కొండలపొదువులను
ఖండించిన మొండెంబులు తలలను తుండెంబులుగాను
వేయియేనుగులు నొక్కసారిగా వేమరునురుకుచును
వేయిగుఱ్ఱముల నొక్కసారిగా పెసదెగవేయుచును
వేయిరౌతుల నొక్కసారిగా విసరటుకొట్టుచును
నాయెడనున్న శూరులబట్టి చయ్యనజంపుచును
ఒక్కసారి వెయ్యికత్తులురాగా తనయొక్క కత్తితోను
చక్కగపోడిమి చెడిజనులందరు వెక్కసపడగానూ
నిభాయించలేకను దండచ్చట నిలువ బారగను
నబాబు తనపాళెంబున దాగెను నంతభయంబునను
నలుదిక్కుల దేసింగుజూడక నంతటనందరునూ
వెలవెలబోవుచు పారిపోవగను వేసరిజూచుచును
పారిపోయెడు వారిని జంపుట పాపంబనుచూను
దారితప్పిదాగిన యెదిరించుట ధర్మముగాదనెను
సరగున నన్నొకశూరుడై నమరి చంపడాయెనివుడు

దేసింగు సేనలు సిథిలమయినదిజూచి
తనప్రాణమువిడుచుటకు నిశ్చయించుట.

బరువడి వొంటిగ నేనిటువూరికి పరగబోదునేడూ
మహామత్ ఖానుడు జమేదారునను పెనపినతండ్రియును
నహాగా బారా హజారిదండులో సమసిపోయిరికను
రయముగ నాప్రాణములింకేటికి రంగునాథస్వామి
ప్రియముగ నీపాదముల జేర్చునన్న రంగనాథస్వామి
వాసుడను నిదుసన్నిధిని దనర జేర్చుస్వామి
వాసిగనిను నెరనమ్మపవాడను వచ్చిప్రోవుస్వామి
నా క్రమంబు నీ కెఱింగించితిని రంగనాథస్వామి

చక్రముబంపుడు వేగమేనాకు త్వరకరంగస్వామీ
అనుచు ప్రాణములు పోగొట్టుటకు నంతనిశ్చయించి
తనమనంబునను రంగనాథస్వామిని తప్పకవపుడుంచి
పద్మాసనము వేసికూర్చుండెను తా బరువడిదేసింగు
పద్మాక్షుండగు సూర్యునిజూచుచు పల్కెనుదేసింగు
నేనురంగని భక్తుండయితె నిజముగానుయిపుడూ
నేను శూరసింగుని సుతుడైతె నిజముగానుయిపుడూ
నేను సత్యమును తప్పకయుండిన నిజగామునుయిపుడూ
నేను యేకపత్నివ్రతుండయితె నిజముగానుయిపుడూ
నేనుశూరుడయితె యీకత్తినిజముగానుయిపుడూ
పూనికతో నారొమ్మునినాటి పొసగచంపునేను
అనుచుకత్తి తా నెగవేసి రొమ్మపుకు జూపగానూ

దేసింగుమహారాజు కళేబరంబునుజూచి నబాబు వ్యసనము జెందుట.

ఘనమగుకత్తియు రొమ్మునినాటి కడసిదూతెవెసను
హరిహరియనుచును ప్రాణము విడిచెను నప్పాడుదేసింగు
సరసిజాక్షియని ప్రాణమువిడిచె చయ్యనదేసింగూ
అప్పుడునబాబు దండుననుండి యతిశీఘ్రముగానూ
నిపుణుడయిన దేసింగునిపాటు నెవసిచూచుటకును
దండుతోడను నబాబప్పుడు దగ్గరకివచ్చి
పండితుడగు దేసింగునిజూచి బహువ్యసనమునించి
యేనుగుపైన నుండుబాబు తానటుదిగివచ్చి
ప్రాణముపోయిన దేసింగుని తా బరువడినటుజూచి
కూర్చుండియు దేసింగునిజూచి కొంతవగచివగచి
జేర్చి యతనిముఖమున తనముఖమును మూర్ఛపోయిలేచి
బాలుడదేసింగయ్యానాతో పలుకవేమినిపుడూ
చాలయలసి నిద్దురపోయెద వింతేలవచ్చెనేమూ
యింతశూరుడని తెలిసితె నేను యిప్పుడు దేసింగూ
యింతరాజ్యము యేలుమనుచు నీకిత్తురదేసింగూ
దెలగియింతి కార్యంబని తెలిసితె చెంజిపైకమేను
తలచనుమొందుకు యడిగితినిన్ను తగవుమాలినేనూ

మాటిమాటికిని ముద్దుబెట్టుకొని మరిమరినగచుచునూ
నూటిగ దేసింగునిశృంగారము చూచియూ నేడ్చుచుచును
పాడైయై తెనే నీవుజచ్చుటకు బాలుడదేసింగూ
పాపపుబిందలు వడితినిభువిలో బాలుడదేసింగూ
లక్షయేనుగులు నీచేమడిసెను యీ క్షణంబులోనూ
లక్షణమగు గుఱ్ఱంబులునాలుగు లక్షలునీచేనూ
సురమునకోట్ల సంఖ్యజనములను నరగునవరికితివే

నబాబు బంగార్నాయునిజూచి బంగారుపల్లకిలో
దేసింగుమహారాజునుంచి చెంజికియెత్తించుకొని పొమ్మని సెలవిచ్చుట.

క్రమముగ నీకత్తికిసరిలేకను కదసియుతిరిగితివే
తడయకనబాబు వగచుచుండగ దగ్గరవారెల్లా
తోడబడమూర్ఛిల జెందుచునందరు దుఃఖపడుచునెల్ల
వుండినబాబు బంగార్నాయుని యొప్పుగానుజూచి
మెండుగపల్లకిదిండ్లను మెత్తలుదెప్పించి
చెలువుతో దేసింగునినందుంచి చెంజికినిసేడూ
జలిదిగనీవును తోండ్రమల్లుడును జమేదారులిపుడు
పల్లకినెత్తించుకపొమ్మన్నను బంగార్నాయుడును
మెల్లగదేసింగునియెత్తియూ నాపల్లకిలోపలనూ
పట్టియప్పుడు బహుజాగ్రతతో నిట్టిభుజంబులను
పట్టుపట్టుడని యెత్తుకపోయిరి పరగచెంజికటను
ముందుగ తోండ్రమల్లునిబంపి యందురాణితోను
సందడిసేయక సమాచారములు జలిదిచెప్పుమనెనూ
తొందర పడుచును చెంజికిపోయి తోండ్రమల్లుడును
అందున్న దాసీలతో చెప్పగ నంతటవారలను
దేసింగునిపట్టంతరాణితో దెలియజెప్పగానూ
వాసితప్పియూ రాణియప్పుడు వారితోడనలెను
ముందుపోటు తగిలితే తెమ్మనుము ముఖ్యముగానిటకు
అందుకు వెనుకపోటయితె తేవలదని దెలువుమనెను
జొమ్ముపోటు తగిలినదని జెప్పగ రమ్మని సెలవిచ్చె

సమ్మతముగ తననాధునిజూచి చాలగ దుఃఖించి
యున్నవారు పల్లకి నటుదించి యొప్పుగ నందరును
మన్ననమున ప్రాణములవిడిచెది ప్రాణనాధు జేరి
మాణిక్యమా నాప్రాణసఖ్యమా మరియునిన్నుకోరి

రాణి దేసింగుమహారాజును జూచి దుఃఖించుట.

పెండ్లిచేసుకొని యేమిసుఖంబుల ప్రీతినమభవి స్తి
కండ్లనిన్నుజూచుటకే నీకడగండ్ల నోమునో స్త్రీ
నావద్దికి నీవచ్చినపుడె నరసిప్రాణనాథా
పోవద్దని నేనెంతోజెప్పితె పొసగప్రాణనాథా
వినకపోతి నికనేమి నేయుదును వెఱ్ఱినిజేసితివే
వెనకనింక నాకెవ్వరుదిక్కు వృథాగా జేసితివే
అని తననాధుని పైబడియేడ్చును తడబడి మూర్ఛిల్లుచు
ఘనుడగు దేసింగుని రూపంబును కనుగొని వగగొనుచు
జూడవచ్చిన వారలెల్లరును జూచి మోదుకొనుచూ
తోడవచ్చిన దాదులుజూచుచు గూడిజెప్పుకొనుచు
బహువ్యసనముతో దగ్గరనుండెడి బంధుజనులజూచి
సహజంబుగ వారలతో బలికెను సమ్మతంబుమించి
గుండమొక్కటి త్రవ్వించుడని వారిరాణియపుడు
దండిగ గంధపుచెక్కలనందులో దనరవేయునేమా
వాసనద్రవ్యము కర్పూరంబును వరుసనెయ్యిబోసీ
వాసిగమంటలు వేయుమనుచు వారికి సెలవిచ్చి
స్నానముజేసి పసుపుచీరెయును చాలగ ధరియించి
పూనిపసుపు కుంకుమపువ్వులను పొంకుగానుదాల్చి
నవరత్నంబుల భూషణములుబెట్టి నాధుని మదినెంచి

రాణిస్వర్గంబునకు బోదలచి ముత్తయిదువులను
పసుపు కుంకుమలిచ్చి దీవెన లొసంగుట.

భువిలోగల భూసురులకు నెల్లను పొసగదక్షిణలిచ్చి
భాసురంబుగను ముత్తయిదులకు పరగమోదంబునను
వాసికెక్కిన చీరెలు రవికెలు వరభూషణములును

కుంకుమపసుపు పుష్పగంధము కోర్కెదీరగాను
శంకలేక వారలకును యిచ్చి చాలదీవెనలును
కయికొని వారల కెల్లరకును నమస్కారమపుడు జేసి
ప్రాకటమొప్పగ భక్తితోడను బావుకములవడసి
దేవతలకు దామ్రొక్కినప్పుడుదివ్యపదవిగోరి
భావమురంజిల్లజూచె నంధరిని పరమపదముమీరి
మూడుచుట్లు గుండమునకును తాముఖ్యముగావిచ్చి
తోడనే తననాథునిదగ్గిరికి వేడుకలరవచ్చి
తాంబూలంబును జేసిరత్నముల్ దనరచేతబట్టి
అంబరంబునకు నెగర రత్నములంత చెదరగొట్టి
చుట్టబడ్డయా రత్నములెల్లను సొంపుతోడజనులు
అట్టయెత్తుకొని సంతోషమున నలరంతజనులూ
నాథునిగుండంబున నిల్చియు తానంత సమ్మతించి
సాధులకెల్ల నమస్కరించి తాసరగనగ్ని జూచి
భావంబున శ్రీహరిహరియనుచును పరగసంతసించి
దేవుండయినయగ్నిహోత్రుని తేజమునకు మ్రొక్కి
నారాయణ శ్రీకేశవయనుచును అంతనగ్నిజొచ్చి
సారెకు శ్రీపరమేశాయనుచు సరవితోడజొచ్చి
వున్నత యాదేవవిమానము నొప్పుగాను రాగా
సన్నుతులగు యాదంపతులిద్దరు స్వర్గమునకుపోగా
పుష్పవిమానం బచ్చటనప్పుడు పొందుగ దేవతలు
పుష్పవర్షమును గురియించుచు పొగడిరంత మేలు
అనినారదముని దేసింగునికథ నంతదెలుపగాను
వినిసురనాథుడు సంతసించెను వేడ్కమీరగాను
సరగునారదుడంత లోకసంచారముగైకొనెను.
గరిమతో నేగిరి దేవతలెల్లను కడుముదమొందగను
శూరుడయిన దేసింగుమహారాజుకథను సొంపుగనెవరం
సారెకువ్రాసిన చదివినవిన్నను స్వారస్యముగనిన
పుత్రపౌత్ర భాగ్యంబులుకలిగి పొందుగాను నెలసి
గోత్రవృద్ధియును శత్రునాసనము కోరికలనువడసి

రాణియగ్నిప్రవేశంబుజేయ దంపతులు
దేవవిమానమునెక్కి స్వర్గంబునకు యరుగుట.

ఆయుర్వృద్ధియు శ్రేయస్కరమును అధికసంపదలను
శాయకనెప్పుడు గలుగును వారికి బహులోకంబులును
ఆచంద్రార్క స్థాయిగనీకథ అక్షరంబుగానూ
భూచక్రంబున నుండగవలెనని పొందుగకోరెదను
విరచించితి దేసింగుమహారాజుకథ వీనుల వేడుకగను
నరగునదిద్దుడు సద్బుధులెల్లను సంభ్రమంబుతోనూ
సామాన్యముగ జెప్పితినీకథ స్వారస్యముగానూ
రామార్పము జేసితినిప్పుడు రమణీయంబుగను

శ్రీ రంగనాథార్పణమస్తు.

సంపూర్ణము.



ఆనందభారతి ప్రవర్ ప్రెస్, మదరాసు—1.

# శెగరోగనివారణి.



మూత్రము వెడలునపుడు పోట్లు, మంటలు, మూత్రద్వారము నుండి తెల్లగాగాని, పచ్చగాగాని చీమువంటి ద్రవము వెడలుట, పొత్తికడుపు నరములు బిగదీయుట మూత్రకోశమున బొట్లు తరుచుగా విసర్జనము చేయుట, మూత్రము బొట్లుబొట్లుగా వెడలుట మొదలగు గుణములతో నీరోగము ప్రారంభించిన వెంటనే ఈ ద్రావకము యేడుపూటలు సేవించిన నాళముదగ్గర పుండుమాని చీమువంటి ద్రవముకట్టి మూత్రము ధారాళముగా వెడలును. నాళములయందలి జిలజిల మానును ఈ ద్రావకము పాత శెగరోగములనుకూడ నతిత్వరలో మాన్పును. 1 సీసా **1-4-0**

# రామక్రిష్ణా పండ్లపొడి.



ఇది దంత చూర్ణములలో నన్నిటికంటె శ్రేష్ట మైనది పండ్లఒదుట, చిగుళ్లునెరుగుట, పండ్లయందు రక్తముకారుట, పంటిసైత్య, పల్లుపుచ్చిపోవుట పంటిగబ్బు, మొదలగు వానిని ఖండించును.

డబ్బి 4-కి **1-0-0**

# సుఖవిరేచన మాత్రలు.

ఇవి శ్రేష్ఠమైనవి. బిడ్డలకు 1-2 మాత్రలను పెద్దవారలకు 3 మాత్రలును పుచ్చుకొనిన సుఖముగా 2-3 మారులు విరేచనమై అజీర్ణ వాయువు జలుబు జ్వరము మొదలగు వాటిని హరించును. 1 డబ్బి **1-0-0**

# భోగశోక నివారణీ మాత్రలు.

సంభోగమైనతోడనే ఈ మాత్ర ఒకటి పుచ్చుకొనిన చాలు అయినను కించి త్కాలమైనను శ్రాగినయెడల సంతర్పణముఖమున కలిగిన నీరుచురుకు [illegible] [illegible] నాసుట, ఉష్ణము మొదలగువాని వ్యాధులను [illegible] 10 నిమిషములలో [illegible] భోగ సుఖం కలిగించును. [illegible] ఉపయోగించిన [illegible] [illegible] పథ్యములేదు.

20 మాత్రలు **1-0-0**

# మూలరోగ సంజీవి లేహ్యము.

లోపలిమూలము, బయటిమూలము, చీముతోచేరిన మూలము, రెట్టమూలము, రక్తమూలము మొదలగు పాతరోగములను సకలవిధ మేహవృష్ణములనున్ను, మూలరో గుల [illegible] [illegible] [illegible] నివర్తింపజేయును. 1 డబ్బి **2-0-0**

---

కె. వి. గోపాల్ అండు కో., నెం. 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మదరాసు.